# మహాపండితుల
# సాహిత్యవ్యాసాలు

# పరిపాటి

మహాకవి శ్రీ మధునాపంతులవారి పసిడి పలుకుల తలపుపంటలు జాతిభుక్తం చేయాలని ఎవరికనిపించదూ! ఆకాశానికెత్తి పొగడుకోవడంకన్న అవకాశమున్నంత వరకూ గురురచనలు వెలువరించుకోవడమే మిన్న అని నాకు సూచించినది సన్నిధానం నరసింహశర్మగారు.

భక్తిభయాలతో "మీ ప్రసంగ వ్యాసాలు కొన్నింటి ప్రకటనకు అనుమతిస్తారా" అని నేరుగా అడగలేని నా మనోభావాన్ని కనిపెట్టి, సతీసమేతంగా గురువర్యుల సమక్షంలో నిలువబెట్టి, ఆయన చలువగుండెనుండి అనుమతిని అనుగ్రహింపజేసినవారు మయూరి కళాసమితి కార్యదర్శి శ్రీ గుడిపాటి శ్రీహరికృష్ణగారు

నా కోరిక ఆవిష్కరింపబడునంతవరకూ నాకు చేదోడు వాదోడై కూడ నిలబడిన పైదోడు మా సమితి కోశాధికారి ఎల్లూరి రఘునాధశర్మగారు

సముచిత రమణీయంగా ముఖాక్షర తిలక రచన చేసినవారు బాపూగారు

## వీరికి అభివందనాలు

ఇంతకూ,

ఈ సంపుటం ఇలా వెలువరించుటకు అనుగ్రహ వ్యాసం ప్రసాదించిన మా గురువుల వాత్సల్యానికి నా ఆనంద భారాన్ని తెలుపుకోగలగడం ఎలా ?

**చింతల గోపాలరావు**

మయూరి కళాసమితి

# ఆంధ్రమహాభారతము

# వచనోపక్రమము

ఈ ప్రస్తావము భావుకులకు నవీనము కాకపోవచ్చును. నన్నయ భట్టారకుల సారస్వతమున మహాభారతావతారిక మనము చూచు చున్నదే, ఆయన సర్వసిద్ధాంతముల కా యవతారిక ఆయువుపట్టు. లక్షణగ్రంథ ఘట్టముగానున్న యాభాగములో వ్యాఖ్యానతః విశేష ప్రతిపత్తి గోచరించుచునే యుండును. "నహి సందేహా దలక్షణమ్"

అవతారికలో రాజరాజనరేంద్రుని కొలువు నభివర్ణించుచు వ్రాయఁబడిన యొక వచన మున్నది. ఆ కొల్వునఁ గూర్చుండిన విద్వజ్జనులు అయిదు శ్రేణులుగా నున్నారు. ప్రథమశ్రేణి వైయాకరణులది రెండవది భారత రామాయణాద్యనేక పురాణ ప్రవీణులైన పౌరాణి కులది. మూఁడవ శ్రేణిం దీర్చియున్నవారు మహాకవులు. నాల్గవ యైదవ శ్రేణులకుఁ దార్కికులు వైణికగాయకాదులు వచ్చిరి. ఇది నన్నయ్య భట్టారకులు సాక్షాత్తుగా చూచి చెప్పిన రాజనరేంద్రుని సభాభవన ప్రాంగణములోని ఆసనశ్రేణీ పరిష్కరణము. ఇక్కడ నొక చిక్కు :

ఒకనాఁడు సులతాను కొలువులో షాజీపుత్రుడైన శివాజీకి అయిదువేల సరదారులు కూర్చున్న పంక్తిలోఁ బీఠము చూపఁబడెనఁట. మనస్వియగు శివాజీకి అది భరింపరాని పరాభవ మైనది. ఆ మహా రాష్ట్రనాయకుడు వారు చూపిన యాసనశ్రేణికంటె సమున్నతమైన యాసనముపై అధిష్ఠింపదగినవాఁడ నన్నఆత్మప్రత్యయము కలవాఁడు. పీఠోన్నతియన్నది యెత్తు పొడవు వెడల్పులనుబట్టి నిర్ణయింపఁదగినది కాదు. తన పీఠముప్రక్క మఱి యెవరి పీఠము లున్నవి! ఆపీఠము లందాసీను లగువా రెట్టి తరహావారు! ఇదికదా ప్రశ్న. మాటలతో వేఱే తుటారింప నక్కఱలేదు. తన దృష్టికి వాఁడు విశిష్టుఁడు కాని,

తుల్యుఁడుకాని కానిచో నట్టివానిచెంతఁ దనకుఁ బీటవేసిన పెద్దమాని సిత్తోఁ దగవుతప్పదు. ఇది యొక యవమానముగా నొకఁడు పట్టించు కొనఁడు. ఒకఁడు పట్టించుకొనును. పట్టించుకొన్నవాఁడు ఆత్మగౌరవము కలవాఁడుగా విజ్ఞలోకమున నభినందితుఁడగు చున్నాఁడు. మొదటి వాఁడు అమాయికుఁడేని, యోగియేని కావలయును.

లోకజ్ఞుఁడు సద్గుణావదాత చరిత్రుఁడునైన నన్నయ రాజ రాజుకొలువులో నే శ్రేణికిఁ జెందిన పీఠమున సమాసీనుఁ డాయెనో! యన్నది యొక వివిదిష. ఆ రాజరాజానురక్తుఁ డెచ్చటఁ గూర్చుండుఁ గాక! పురస్కారమున కేమి కొదవ ? ఇంతకు భట్టారకపీఠము అభివర్ణిత శ్రేణులకు భిన్నమైన యొక ప్రత్యేకస్థానమున నుండవలయును. ఆ స్థానము రాజమనోహరుని యంతరంగముకంటె నన్యముకాదు.

ఈ శ్రేణీ కల్పనమువలన మనము గుఱుతింపవలసినది భట్టార కుల హృదయము. ఆయనకుఁ బ్రథమాభిమానశాస్త్రము శాబ్దము. తరు వాత, మహాకవిత్వము. పదపడి, తక్కినవి. ఈ క్రమములోఁ బూర్వా పూర్వ మాయనకు గాఢాభిమాన విషయములు. తాను విపుల శబ్ద శాసనుఁడు. "ప్రథమే హి విద్వాంసో వైయాకరణాః" కనుక, సభలో వైయాకరణశ్రేణిని ముందుంచుట జరిగినది. నన్నయ తాను బ్రహ్మాం డాది నానాపురాణ విజ్ఞాన నిరతుఁడు. రెండవ శ్రేణిలోఁ బౌరాణికు లను గూర్చుండఁ జేసినది యీ విజ్ఞాననిరతి. నన్నయ తాను కవి,మృదు మధుర రసభావభాసుర నవార్థ వచనరచనా విశారదుడైన మహాకవి యగునుగదా! ఈకవిత్వమునకు స్థానమును మూఁడవదిగా నేల చేసి కొనెను! అహంకార నిరాసార్థమా! ఆయన దృష్టిలో దాని కదియే స్థానము కావలయునా ?

'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని యధ్యాత్మవిదులు వేదాంతమనియు నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని కవివృషభులు మహాకావ్యమనియు'

ఇత్యాదిగానున్న పద్యములో నీక్రమము మఱియు స్పష్టపఱచి భట్టారకులు చెప్పియున్నారు. ఇంతకంటె అక్కజముగా "తనకులబ్రాహ్మణు ననురక్తు నవిరళజపహోమతత్పరు విపుల శబ్దశాసను సంహితాభ్యాసు' ఇత్యాది సీసములో నీక్రమము సువ్యక్తపడుచున్నది. విపుల శబ్దశాసనత్వము తరువాతఁ బురాణవిజ్ఞానము. తరువాత ఉభయభాషా కావ్యరచనము, ముమ్మాటు ఈరీతిగా శాస్త్ర-పురాణ-కవిత్వకళలయొక్క క్రమత పూర్వాపూర్వ విషయములపై తనకుఁగల తత్పరత భట్టారకులు చెప్పినట్లయినది. రాజశేఖరుఁడు కావ్యమీమాంసలో శాస్త్రకావ్యములు-కావ్యశాస్త్రములు - కేవల కావ్యములు - కేవల శాస్త్రములు- ఈ రకముగా విభజనముచేసెను. పురస్సరద్ధర్మానుశాసనమైన మహాకావ్యముగా ఆంధ్రభారతము నుపక్రమించుటలో భట్టారకుల మెలఁకువ తెలుఁగుసరస్వతి యలికమున విశేషక రచన యగుచున్నది.

ప్రాచీనశాస్త్రము లన్నియు నే శబ్దముతో నుపక్రాంతము లగుచున్నవి? అందుఁ గొన్ని మంగళార్థకమైన 'అథ'తో నారంభమైనవి "అథాతో ధర్మజిజ్ఞాసా" - "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" ఇట్లు పూర్వోత్తర మీమాంసాసూత్రములు ప్రవర్తిల్లినవి. "అథ శబ్దానుశాసనమ్. కేషాం శబ్దానాం" ఇట్లు పాతంజల మహాభాష్యము-ఓంకారమునకు అథ శబ్దము సహోదరము. ఈ రెండును మాంగళికములు.

ఓంకారశ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా
కంఠం భిత్వా వినిర్యాతౌ తస్మాన్మాంగళికా వుభౌ ॥

తత్తచ్ఛాస్త్రాదియందుఁ బ్రయుక్తమైన యీ"అథ" అవ్యయమై మంగళార్థకమేకాక అధికార ద్యోతకముకూడ నగుచున్నది. నామలింగానుశాసనము దీని కయిదు అర్థములు చెప్పినది. మంగళము - అనంతరము - ఆరంభము - ప్రశ్నము - కృత్స్నత - ఇవికాక "మేదిని" దీనికి సంశయ మను నర్థము కలదనెను. నన్నయ అవతారికోపక్రమణ

మునకు అథ శబ్దార్థ విచారమునకు ఏమిసంబంధ మందురు! "అథ" శబ్దార్థమునకు సరియగు తెనుఁగు అని యన్నది. అథ వర్ణద్వయాత్మక మైనది. "అని" యు నట్టిదే. అందును ఇందును అకారమే ముందున్నది. "అథ" లోని థకారము తెనుఁగులో "ని" వర్ణముగా దిగినది. ఈ తద్భవతలో మనము సంతోషపడవలసినది తవర్గను దాఁటకుండ జరుగుటయే. ఒకానొక ముచ్చటకుఁగాని యిందు మనకుఁ దద్భవతా ప్రసక్తి యక్కఱలేదు. అథ ఆనంతర్యార్థకము. "అని" యన్నదియు నట్టిదే. ఈ సంస్కృతాంధ్రావ్యయములు రెంటికీ ఇంత బలిష్ఠమైన బాంధవ మున్నది.

నన్నయభట్టారకుల దేశభాషాకృతి రచనము దేవభాషాశాస్త్ర సంప్రదాయానుగతమైనది. ఆంధ్రమహాభారతము "అని సకలభువన రక్షణ ప్రభువులై యాద్యులైన హరిహర హిరణ్యగర్భ పద్మోమా వాణీపతుల స్తుతియించి తత్ప్రసాద సమాసాదిత నిత్యప్రవర్ధమాన మహామహీరాజ్య విభవుండును నిజభుజ విక్రమ విజితారాతిరాజ నివహుండును నఖిల జగజ్జేగీయమాన నానాగుణ రత్నరత్నాకరుండునై పరగుచున్న రాజరాజనరేంద్రుండు".

అను వచనముతో నుపక్రమింపఁబడుట చూడఁగాఁ బూర్వోత్తర మీమాంసాది శాస్త్రములవలె అథశబ్దసహోదరమైన "అని" మున్మొదటఁ బ్రయుక్త మయ్యెనని విజ్ఞులు తెలిసికొనియుందురు. ఆంధ్రమహాభారత మిటులు భట్టారకుల యుపక్రమణ సంప్రదాయముతో శాస్త్రమై కవివృషభులకు మహాకావ్యమగుచున్నది. మహాకావ్యమైనపుడు కావ్యప్రయోజనము ఆదియందు సూచింపఁబడవలయునుగదా! ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశములలో నేయొకటియేని యుండవలెను. ఒకటికాదు, మూఁడింటికి ముడియగు గద్యమే ఆద్యప్రయుక్తమైన దన్నచో నన్నయగారి హృదయము నారాధించుట యగును.

తొలివచనమున హరిహర హిరణ్యగర్భులకు నమస్కారము చేయబడుట-తత్ప్రసాద సమాసాదిత.. అనుటవలన రాజనరేంద్రునకు ఆశీస్సులొసంగబడుట గోచరమగుచున్నది. మఱి వస్తు నిర్దేశము! ఎక్కడో కాక ప్రథమతః ప్రయుక్తమైన శబ్దములోనేయున్నదని నా చేయుచున్న మనవి. నన్నయ తాను పాకశాసని, భారత ఘోరరణమున నద్వితుఁడై దుష్టశిక్షణ సాధుభువన రక్షణములు జరుపవలసినవాఁడు, నారాయణ సహాయుఁడైన యీ నరునితో ధర్మము మహాభారతమునఁ బ్రతిష్ఠితమైనది. దుష్టనిగ్రహమునకు సంగ్రామము వలసియున్నది. భారతసంగరము జరిగినచోటు కురుక్షేత్రము ధర్మక్షేత్రము. "భారం సంగ్రామం తనోతి విస్తారయతి" అని భారతమునకు వ్యుత్పత్తి చెప్పుదురు. ఇంతకు తేలినది భారతవస్తువు సంగ్రామము. నన్నయగారు ఆయోధనార్థకమైన అని శబ్దము నాదిలోఁ బ్రయోగించి వస్తు నిర్దేశమునెంత గుప్తము గావించినారో యిపుడు విచారింపవచ్చును.

"యథాయుధానాం కులిశ మింద్రియాణాం యథామనః ।
తథేహ సర్వశాస్త్రాణాం మహాభారత ముత్తమమ్ ॥
మార్కండేయపురాణం,

మంగళార్థకమైన అథ శబ్దమువంటిదే యగు "అని" తో మహాభారతారంభమగుట-అదికాక వస్తునిర్దేశకరణోద్దేశమున సంగ్రామార్థకమగు "అని" తో సమారంభమగుట-చూడఁగా తెనుఁగుభారతమును శాస్త్రముగా మహాకావ్యముగా నాంధ్రులకు అనుగ్రహించెడి తలంపు నన్నయమహర్షికుండెను. "అక్షరాణా మకారోస్మి", అని కదా భగవద్వచనము.

ఆంధ్రమహాభారతమువంటి సారస్వత ప్రథమావతారము ఛందో బంధేతరమైన, 'అని సకలభువన రక్షణేత్యాది వచనముతో నారంభింపఁ బడెనా ? మఱి -

శ్రీవాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే
లోకానాం స్థితి మావహంత్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్
తే వేదత్రయ మూర్తయ స్త్రిపురుషా స్సంపూజితా వస్సురై
ర్భూయాసుః పురుషోత్తమాంబుజ భవశ్రీకంధరా శ్శ్రేయసే!

మూర్తిత్రియ స్తవాత్మకమైన యీశ్లోకముమాట యేమైనది! ఇది యాంధ్రము కాలేదు. అంతరంగకృతమైన కవిప్రార్థనము శిష్య శిక్షకు గ్రంథాదినుంచుట యాచారము కదా! తెనుఁగు భారతము అచ్చముగా ఎచ్చటనుండి యుపక్రాంత మయిన దనఁగా నాయొద్ద నుండియే యని చెప్పవచ్చినట్లు గ్రంథారంభ సర్వస్వము దాచారగుంఫిత మైన తొలివచనమే చెప్పుచున్నది. పంచమవేదము నాంధ్రీకరించు నపుడు ఛందఃపురస్కారము విధిగా జరుగవలసియుండగా గద్యారంభము శాస్త్రసంప్రదాయ సుందరమైన భట్టారకుల హృదయమును పట్టి చూపుచున్నది. ఆయన గద్యపద్యములకు తుల్యప్రతిపత్తి నిచ్చిన మహాకవి. ఏనాటికిని ఛందః ప్రసన్నమయిన తెనుఁగు పద్య గద్యము లకు నన్నయగారిదే ఆద్యస్థానము- తెలుఁగు భారత సరస్వతి గద్యపద్య స్వరూపిణి.

యా వర్ణపద వాక్యార్థ గద్యపద్యస్వరూపిణీ
వాచి న ర్తయతుక్షిప్రం మేధా దేవీ సరస్వతీ!

శ్రీ శంకరులు

—

# నన్నయ తిక్కనలు
# అవతారికల తెన్నులు

ఇరువురును రెండు మహోన్నత శిఖరములు. మొదటివానిది ఋషిమార్గము. రెండవవానిది రసమార్గము కాలపరిణామము కవితా పరిణతికి సూచకము. భట్టారకులవారికి సోమయాజులవారికి నడుమనున్న కాలము రెండు శతాబ్దులకు మించినది. నన్నయ భారతశేషము విరాటాదిగఁ దిక్కన యాంధ్రావళి మోదమునకుఁ దెనుఁగు చేసెను. నన్నయకుమున్ను చెప్పఁదగ్గ తెలుఁగు సాహిత్యము బయలుదేఱలేదన్నచో, కాళిదాసాది సంస్కృతమహాకవుల రచనలు నన్నయకు ఉపజీవ్యము లయ్యెనని చెప్పక తప్పదు-నన్నయకుఁ గాళిదాస ప్రభృతు లనుకార్యు లనుటవలనను, తిక్కనసోమయాజికి నన్నయ ఉపజీవ్యుఁడనుటవలనను వారివారి స్థానగౌరవములను లాఘవపఱచుటకాదు.

సోమయాజి నన్నయభారతకృతి సారమును అవతారికను పురోడాశమువలె సేవించిన పుణ్యపురుషుఁడు. నన్నయ భారతావతారిక తీరు తిక్కననాఁటి కొక గడుసు మెఱుఁగు దేఱినది. అట్లే లోపలి రచనయు. రాజరాజనరేంద్రుఁడు భారత శ్రవణాసక్తి సందర్భము సర్వము నన్నయ పరోక్షపరిభాషణ ఫణితిలోఁ జెప్పెను. సోమయాజి ప్రత్యక్ష సంభాషణ ఫక్కిలోఁ దన కృతిరచన హరిహరనాథ ప్రసక్తి చెప్పుకొనెను. ఈ ప్రత్యక్ష పరోక్ష కథనవిధానములలో నన్నయ తిక్కనల దెవరిమార్గము వారిది. నన్నయ మంగళశ్లోకానంతరము ఆఱు గద్యపద్యములలో రాజరాజు గుణాకృతి విశేషములు వర్ణించెను. మంత్రి పురోహిత సేనాపతి దండనాయకాది పరీతముగు నిండుఁ గొలువులో సుఖోపవిష్టుఁడై చళుక్యాన్వయాభరణుఁడు "...నిత్య సత్య వచను మత్యమరాధిపాచార్యు సుజను నన్నపార్యుఁజూచి" ఇట్లు పలికెనఁట. "నన్ను నన్నపార్యుఁ జూచి" అని చెప్పుకొనవలసి యుండియు, అన్న

చ్చబ్ద ప్రయోగము అహంతాస్ఫోరక మగునని కాఁబోలు, పరోక్ష పద్ధతిలో నన్నయ వ్రాసికొనిపోయెను. "నేను" శబ్దముతో అంటిముట్టకుండుట పెద్దల భాషణాచారములో నున్నది. "మీ పేరేమి?" అని యడిగినపుడు "రామయ్య యందురు." "రామన్న యందురు" అను వృద్ధ వ్యవహారము క్రమముగా నిపుడిపుడు దూరమగుచున్నది. తురీయాశ్రమస్థులయినవారిలో కొందఱు "నేను" నకు బదులుగా "వీఁడు" వాడుకొనుట నేఁడును వినుచున్నాము.

ఆచారౌచిత్యమునకు జీవగఱ్ఱ యనఁదగునన్నయ కృత్యాదితానై సంతరించుచున్నను చాటుననుండి పరోక్షభాషణము చేయించెను. "అని యానతిచ్చిననిని యక్కవివరుం డిట్లనియె "-నానారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహాభారత సంహితారచన బంధురుఁడయ్యె- "నన్న పార్యుఁజూచి యిట్లులనియె"- ఈ తీరున అవతారిక నన్నయ ఆత్మలక్షణమునకు దర్పణము. అట్టి పరోక్షపద్ధతి ఆధారము చేసికొని యొకరెవరో అవతారికలోఁ గొంతభాగము నారాయణభట్టు వ్రాసియుండునని చమత్కరించినారు. నేఁడు పానుగంటివారి నాటకములు కొన్నిటికి కూచి నరసింహముగారి నాందీప్రస్తావన రచన లున్నవి! ఇది యట్టిది కాదు.

నన్నయనాఁటికిగల పరోక్షకథన విధానము తిక్కనాఁటికి ప్రత్యక్ష కథనముగాఁ బరిణతమైనది - సోమయాజి "పరతత్త్వము గొల్చెద నిష్ట సిద్ధికిన్." "ఒక్కనాఁడిట్లని వితర్కించితి" - "నన్నునాకర్షించి కొలిపించుకొని"-"ఏనును భక్తిమయంబగు"-నాపుట్టు కృతార్థతం బొరసెఁ బుణ్యచరిత్రుఁడ నైతి"-నేర్చిన భంగిఁజెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్"-మహాకవిత్వ దీక్షావిధినొంది పద్యగద్యము లన్ రచియించెదం గృతుల్"-ఏవం విధముగా అస్మచ్ఛబ్దములతో, ఉత్తమ పురుషలతోఁ గృత్యాది గ్రుచ్చియెత్తెను. తెలుఁగు మీఱిన యానాఁటి కీతీరు అహంకార ద్యోతకము కాదన్నమాట.

నన్నయకు మున్ను సంస్కృత సారస్వతమునకుఁ గల విలువ తెలుఁగునకు లేకుండెను. అమరభాషా మర్యాదలు గౌరవించు భట్టారకుఁడు దైవప్రార్థన తద్భాషలోనే రచించి సంతుష్టుఁడయ్యెను. "శ్రీవాణీగిరిజాశ్చిరాయ ...." ఇత్యాది.

తిక్కననాఁటికి దేశభాష దేవభాషాసహపీఠమున ఆసీనురాలయ్యెను. "శ్రీ యన గౌరినాఁబరగు..." ఇత్యాదిగఁ దిక్కన పరతత్త్వ ప్రశంస తెనుఁగుననే జరిగెను. నిర్వచనోత్తర రామాయణమున "శ్రీరాస్తాం, - ఉండుఁగాక! భారతకృత్యాదిలోఁ దిక్కనయుఁ దన కిశోరదశలోని శ్లోకము "కి మస్థిమాలాం కిము కౌస్తుభం వా పరిష్క్రియాయాం బహుమన్యసే త్వం,కిం కాలకూటః కిమువా యశోదా స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే" అన్నదానిని సందర్భింపఁజేసెను. "శ్రీవాణీ..." శ్లోకముతో నన్నయ త్రిమూర్తి స్తవము నే యుద్దేశమునఁ జేసెనో, తత్సబ్రహ్మచారియగు నుద్దేశముతోనే తిక్కన "కిమస్థిమాలాం .." శ్లోకముతో హరిహరనాథస్తుతి చేసియుండును. ఇరువురును ఉభయకవి మిత్రులు, ఉత్తమశ్లోకులు.

సోమయాజి కృత్యాదిలో నొక వైలక్షణ్యము! తాను కల గాంచును. కలలో, తనతండ్రి కొమ్మన కనఁబడి హరిహరనాథునిగూర్చి పరిచయము చేయును. హరిహరుఁడు "కృతిపతిత్వ మర్థించి వచ్చితిఁ దిక్కశర్మ!" అనును. తిక్కనగారి స్వప్నము సత్యార్థగంధి.

అక్కడ రాజనరేంద్రుఁడు తానై నన్నయను తెనుఁగులో భారతము రచింపవేఁడెను. రాజరాజు అన్నది యింతే : ..."భారత బద్ధనిరూపితార్థ మేర్పడఁ దెనుఁగున రచియింపు మధికధీయుక్తి మెయిన్", భారతము తన కంకితముగా నిమ్మని యతఁడు తేలలేదు. హరిహరుఁడో! కృతినర్థించివచ్చితినసెను. వాస్తవమునకు రాజరాజునకుఁ

కృతిగ్రహణ కాంక్షయు నుండదా? రచియింపుమనుటలో రచించి నా కంకితము సేయుమను నర్థము ప్రతీయమాన మగుచున్నదా? నన్నయ లోకజ్ఞత అవతారికలో బహుముఖముగా గోచరించును.

తిక్కన అవతారికలోని విలక్షణతలలో స్వప్నప్రసంగ మొకటి. షష్ఠ్యంతములును క్రొత్తలు. సోమయాజి పిదప కొందఱు ప్రబంధ కారులు కలలుగాంచిరి. షష్ఠ్యంతములు సరేసరి. షష్ఠ్యంతములు లేనిచోఁ బ్రబంధమే కాదనునంతటి గాఢప్రచారము వానికి వచ్చినది. కృతిపతి వ్యవహారమునఁగాక సంస్కృతకావ్యమున ఈ పద్ధతి యొక మాదిరిది. "శైశవేఽభ్యస్త విద్యానాం యౌవనే విషయైషిణాం వార్ధకే ముని వృత్తీనాం... రఘూణామన్వయం వక్ష్యే"— రఘువంశము తెలుఁగు వారి షష్ఠ్యంతములకు దిగ్దర్శని యైనదనవచ్చును. సోమయాజి యెత్తు గడలలో షష్ఠ్యంతముల కవిరళప్రచారము, స్వప్నసంగతికి విరళ ప్రచారము చేకూరినది.

నన్నయ భారతము రాజరాజునకు వినిపించెను. తిక్కన హరిహర నాథునకు భారత మంకితముచేసెను. "పుట్టు కృతార్థతం బొరసెఁ బుణ్య చరిత్రుఁడనైతి"నని జన్మచారితార్థ్యమును తిక్కన లెక్కించుకొనెను. నన్నయ కటులుకాదు "అమలిన తారకాసముదయంబుల నెన్నను సర్వవేదశాస్త్రముల యశేషపారము ముదంబునఁ బొందను.. భారత భారతీసముద్రము దరియంగ నీఁదను విధాతృనకైనను నేరఁబోలునే!" అను సంశయ మాయన యంతరంగమున నున్నది. రెండున్నర పర్వ ములకు మాత్రమే పర్యాప్తమైన తన భవిష్యము తొలుతనే తలపోసి కొన్నాఁడు. "హృదయాహ్లాది విరాటపర్వమట నుద్యోగాదులుం గూడఁగా బదునేనింటిఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై యొప్పఁగాఁ దుదిముట్టన్ రచియింపుటొప్పు బుధసంతోషంబు నిండారఁగన్" ఇట్టిది తిక్కనగారి విశ్వాసము. సాధారణముగాఁ గృతికర్త కృత్యారంభమున మంగళపద్యములు కొన్నివ్రాసి, కృతిసమాప్తి చేసి, పదపడి కృత్యాదికి

మరలవచ్చి మఱికొన్ని చేర్పులు చేయుచుండునేమో! నేఁడు కృత్యాద్యవస్థలు లేవు. నన్నయ కృత్యాది ముస్ముందరనే రచించి యుండును. తిక్కన కొంతముందు, కొంత వెనుక వ్రాసియుండెనేమో!

నన్నయ తన పూర్వవంశీయులను గూర్చికాని, తలిదండ్రులను గూర్చికాని యేమియుఁ బ్రసంగింపలేదు. ఆపస్తంబసూత్రుఁడనని, ముద్గలగోత్రుఁడనని చెప్పుకొనెను. తిక్కన తనతండ్రి గుణవిశేషమును సమగ్రముగాఁ బేర్కొనెను. "తన కులబ్రాహ్మణు" మున్నగు సీసములో నన్నయనిజవిశేషములు వెల్లడించెను. తిక్కన తన తండ్రిని గూర్చి యొక సీసము వ్రాసెను. ఇష్టదేవతాభ్యర్థనములో నన్నయది తనివితీరని శ్రద్ధ "హరిహరాజ గజాననార్కషడాస్య మాతృసరస్వతీ గిరిసుతాదిక దేవతాతతికి" ఒక గుక్కలోఁ బ్రణతిపాఠము చెప్పినాఁడు. విద్వత్సంస్తవనీయ భవ్యకవితా వేశుండు ..మున్నగా భారత ప్రశంస నవీనముగాఁ జేసెనేకాని, ప్రత్యేకించి అజగజాననాదుల స్తుతికిఁ బద్యము వ్రాసినవాఁడు కాలేదు తిక్కన. "విద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్" అని చెప్పిన తిక్కనకు భట్టారకుఁడొక బ్రహ్మ.

నన్నయ భారతావతారికలోని భూయోధర్మము తిక్కన యవతారికలో నున్నది. రెండును పుష్పవంతులు. ఒకనికవిత ప్రసన్నకథాకలితము. వేఱొకనిది ఊర్జిత కథోపేతము, ఒకఁడు నానారుచిరార్థసూక్తినిధి; వేఱొకఁడు నానారసాభ్యుదయోల్లాసి, ఒకఁడు జగద్ధితమునకు భారతము వ్రాసెను: వేఱొకఁడు బుధసంతోషమునకు భారతము వ్రాసెను.

ప్రథమునిది కర్మభావన. ద్వితీయునిది బ్రహ్మభావన. నాదృష్టి కిటులు తోఁచును. "అమల సువర్ణ శృంగఖురమై... భారత బద్ధస్పృహులగువారికి నెప్పుడు బహుయాగంబుల ఫలంబు పరమార్థమగున్"– నన్నయ విశ్వాసము తాదృశము.

“జనన మరణాదులైన సంసార దురితములకు నగపడకుండఁగఁ దొలఁగు తెరువుగను వెలుంగు నీకిచ్చితి” మున్నగునవి సోమయాజి బ్రహ్మ భావనకు సూచికలు. పరమార్థతః కర్మబ్రహ్మభావనైక్యము చెప్పఁబడునుగదా! తెలుగు సారస్వతమున నన్నయ తిక్కనల భారతావతారికలు పూర్వోత్తర మీమాంసలకుఁ బ్రతిచ్ఛందములు. భట్టారకులది జైమిన్యంశ. సోమ యాజులవారిది ద్వైపాయనాంశ - తెలుఁగు కవులపాలిటికి వారు ధర్మబ్రహ్మ దర్శనకారులు.

—0—

# నన్నయ తిక్కనల గద్య పద్యములు

నేఁటికిని కొన్ని పల్లెటూళ్ళలో నిత్యము పురాణశ్రవణము జరుగుచుండును. భారతమో రామాయణమో ఒకరు చదువుట, ఒకరు అర్థముచెప్పుట సాధారణముగా నలవాటు. సహపాఠక నిరపేక్షముగా సాగెడి పురాణములు నుండును. అనఁగా పాఠకుఁడు వ్యాఖ్యాతయుఁ దాన. పట్టణమందలి పౌరాణికులు సాధారణముగా అసహాయులుగానే యుందురు.

నేను పెరిగిన పల్లెటూర తెలుఁగుభారతము పురాణముగా చెప్పఁబడుచున్నది. పాఠకుఁడు వేఱు. పౌరాణికుఁడు వేఱు. పాఠకుఁడు నాటరాగములో ప్రార్థనాదికముచేసి ఘట్టముతీసి పద్యముపాడెను. రాగరంజితముగా విసరి చదువుటలో, ఆచదువునది వచనమైనను పద్యముగానే సామాన్య శ్రోతకు భాసించెను. రసానుగుణమైన రాగముతో పాఠకుని పద్యాంతస్వరమున శ్రుతికలిపి పౌరాణికుఁడు 'అర్థము' పాడును మరలఁబాఠకుఁడు చదివి పాడును. పౌరాణికుఁడు అర్థము చెప్పును. రాత్రివేళ సద్దుమణఁగి యున్నది. పురాణశ్రోతలు తన్మయావస్థకు వచ్చుచున్నారు. ఘట్టము ఆదిపర్వములోనిది నన్నయగారిది. అచ్చటి గద్యమును బద్యమువలెనే రాగములోఁ గలిపి పాఠకుఁడు పాడఁగా - గుఱికి బారెఁడు ఇంచుమించులో అది పద్యమేమో యన్నసవి నాచెవికిఁ దగిలినది. 'అదియేమి పద్యమయ్యా' అని పాఠకు నడిగితిని. అతఁడు కవిత్వపుఁ గర్మమునఁ నిర్లిప్తుఁడగుటచే "వ" అని పద్యముఖమున నన్నదని జవాబుచెప్పినాఁడు. ఓహో! వచనపద్యము కాఁబోలు! అని నవ్వుకొంటిని. పురాణరాగ సమ్మేళనముతో నన్నయగారి గద్య పద్యములకు అద్వైతము ఆ పాఠకుఁడు నాఁటిరాత్రి బోధించినటులయినది. తరువాత గ్రంథము నందుకొని ఒకఁడొకఁడు చదువుకొని పోవుదును గదా! అబ్బురపాటుతోపాటు ఆనందము! ఆ ఘట్టమిది :

"వ"నీవు బ్రాహ్మణుఁడవు నీ వెద్దిసేసిన నీకచను లోకహితుఁడ నయిన నాకు శాపంబిచ్చి లోకంబులకెల్లఁ జెట్టసేసితి వదెట్లనిన ..."

(అది. ౧.౧౪౦)

ఇందు పూర్ణబిందువులు రెండు అరసున్నలుగా మార్చి, మూఁడవపాదములో యతిభంగమునకోర్చి, రెండవచరణములో సూర్య గణముచేర్చి, నాల్గవపాదములో రెండక్షరములు తొలఁగించిచూచినచో 'ఆటవెలఁది' యైనది. ఇదిగో !

నీవు బ్రాహ్మణుఁడవు నీ వెద్దిచేసిన
నీక చనును (గాక !) లోకహితుఁడ
నయిన నాకు శాపమిచ్చి లోకంబుల
కెల్లఁ జెట్టచేసి తెట్టులనిన.

అది యాది సర్వదా నన్నయగారి గద్యము లీదృష్టితో పరిశీలించుకొనుట యగుచున్నది. ఆయన ఆంధ్రవాఙ్మయమునకు ఛందోవతారము. గురు పద్యవిద్యకు నాద్యుడు. వాల్మీకి అక్కడ నెట్లో, ఇక్కడ భట్టారకుఁ డటులు. తిక్కన విద్యాదయితుం డని భట్టారకు నుట్టంకించుటలో రహస్యము పద్యవిద్యకుఁ జెందినదే.

క్షేమేంద్రుఁడు తన 'కవి కంఠాభరణము' నఁ గవితాభ్యాసము కావించువారి కోసము కొన్ని దారులు ఏర్పఱచినాఁడు. ఛాయోపజీవి, పాదోపజీవి, పద్యోపజీవి, భువనోపజీవి — ఈ తీరులయిన తర గతులు కల్పించి మాదలించినాఁడు. అది తలఁపునకు రాఁగా ; నన్నయ గద్యములు కొన్ని వేరుగా నేటి యొసఁగి ఆపదములతో అలఁతియలఁతి మార్పు చేర్పులు చేసికొనుచు గీతాదిపద్యములుగా వ్రాయఁజూడు డని కొందఱు పద్యవిద్యార్థులకు మచ్చులుచూపి చెప్పితిని. ఆభ్యాసికమైన

నిపుణతతో ఈ పద్ధతి లెస్సగా నున్నదని వారి యనుభవము వారు చెప్పిరి. దీని సారార్థము · నన్నయభట్టారకుని ప్రతి గద్యము ఛందో నిర్బంధ మధురమైన పద్యముగా నుండుననియే, అన్నింట నొక శ్రుతిమోహనమైన రాగచ్ఛాయ యున్నటులే తోఁచును.

(౧) అట్టియెడఁ గద్రువయు వినతయు వినోదార్థంబు విహరించు వారు కరిమకర నికరాఘాతజాత వాతోద్ధూత తుంగతరంగాగ్ర సముచ్చల జ్జల కణాసారచ్ఛటాచ్ఛాదిత గగనతలంబైన దాని నుద్యానంబునుం బోలె బహువిద్రుమ లతాలంకృతంబైన దాని...''

(౨) వానింజూచి కాని కడువనొల్లనని దేవయాని యేడ్చుచున్నఁ బెద్దయుం బ్రొద్దునకుఁ బ్రసన్నుండై శుక్రుండు తన యోగదృష్టింజూచి లోకాలోకపర్యంత భువనాంతరంబునఁ గచుంగానక సురాసమ్మిశ్ర భస్మమయుండై తన యుదరంబుననున్న యక్కచుం గని...''

(3) ''అదియును నూఱుయోజనంబుల వెడల్పును నూట యేఁబది యోజనంబుల నిడుపును నేను యోజనంబుల తనర్పునుం గలిగి వైహాయసంబయి కామగమనంబయి వ్యపేతశీతాతపంబును సకలకాల కుసుమ ఫలభరిత పాదపవన సంకీర్ణసరోవర విరాజితంబయి తపః ప్రభావంబున నమరేంద్రుచేత నిర్మితంబయి కరంబొప్పుచుండు నట్టి సభయందు

(౪) వ. ''అట్టి యవసరంబున ద్వారవతినుండి యాహుక ప్రేషితుండయి యొక్కరుం డతిత్వరితగతిం బఱతెంచి సాల్వుచేత నక్కడ వసుదేవుండు పట్టువడియె...'' (అరణ్య - ౧ ౧౯౦)

ఈ వచనము గీతగమనము కలది. ప్రథమ చతుర్థ చరణముల యందు ఒక్కొక్క యక్షరము చేర్చవలసియుండును, యతిమైత్రి చూడరాదు.

గీ. అట్టి యవసరంబున (ను) ద్వారవతినుండి
యాహుక ప్రేషితుండయి యొక్కరుండ
తిత్వరితగతిం బఱతెంచి సాల్వుచేత
నక్కడ (న్) వసుదేవుండు పట్టువడియె.

(౫) దానవభస్మసాత్కరణ దారుణము...(అరణ్య ౧ ఆ. ౧౯౩)

ఏను సముద్రతీరంబున సాల్వుతోడం బది నెలలు యుద్ధంబు సేసి వాని వధియించుపొంటె నక్కడ మసలితి నది కారణంబుగా మీకు దుర్వ్యసనావసరంబున నలబ్ధ సన్నిధానుండనయితి నదియెట్లని యుధిష్ఠిరుం డడిగిన నాతనికి సౌంభకాఖ్యానంబు సవిస్తరంబుగాఁ గృష్ణుం డిట్లని చెప్పె ... (ఆది. 1.150 వ)

ఈ చివరి వచనము ఉత్పలమాలలో వ్రాయఁ గుదురును. ఏను సముద్రతీరమున నెంతయు సాల్వునితోడఁ బోరియున్ వాని వధించు పొంటె.........సౌంభకా ఖ్యానము......ఈ రీతిని ప్రాసస్థానములు కూడ ఈ వచనమే సూచనము చేయుటలేదా!

(౬) మఱియు సారథిఁచూచి విహ్వాలమానసుండయి యిట్లనియె. (అరణ్యా. 1.169)

"మఱియు సారథిఁజూచి విహ్వాలమానసుండయి యిట్లనేన్"— ఇది సరళవృత్తచరణగతిలో సాగిన వచనము

(౭) అగ్నిభట్టారకు ననుమూప శుభవచనంబులు (ఆది. 2.250)

ఈ వచనము నన్నయభట్టారకు ననుమూప శుభవచనంబులకుఁ బౌనరుక్త్యముగా నున్నది.

అగ్నిభట్టారకుఁడు, విష్ణుభట్టారకుఁడు, భర్గభట్టారకుఁడు, అని పెక్కుచోట్ల నన్నయభట్టారకుఁడు ఉపయోగించెను. పూజ్యార్థకమైన

యీ భట్టారక శబ్దము వాడఁబడిన పట్టులనెల్ల నన్నయగారి ఆత్మ సమాశ్రయమైన కవిత్వమూర్తి సహృదయులకు చతురాతిథ్యము చేయుచునే యుండును.

భటతీతి భట్టః వాగ్మీ భట పరిభాషణే తన్ ప్రత్యయః=పూజ్యః

దండి, భట్టబాణుఁడు, సుబంధుఁడు మున్నగు సంస్కృతకవులవియు, ప్రాచీనాంధ్ర ప్రబంధాంతర్గతము లైనవియునగు గద్యములలోఁ గొన్ని పద్య శైలీకములు లేవా! యనవచ్చును. ఉండవచ్చును. కేవల వచనకృతులు కాక చంపూఫణితిలో నున్న కృతులు చూచి నపుడు పద్యముప్రక్కనున్న గద్య మెట్లునడచినది? గద్య పద్యముల తూకమెట్లున్నది? మొగ్గుతగ్గులెట్లున్నవి! మనము పరామర్శింపఁ గలుగుదుము. కేవల వచనకృతులలో, కేవల పద్య కావ్యములలో, ఈరీతి విచారమున కవకాశము లేదు.

ఇక్కడ విశేషము. నన్నయగారి గద్యపద్యములలో కే్రుకక్కలో దిరుగును. పద్యములోని నాద మేస్థాయిలో నుండునో దాని వెంట నున్న గద్యమున కదేస్థాయి నాదము. కవిత్వములో నిదియొక గాంధర్వ విద్య. ఎక్కడ నేవృత్తము వ్రాయవలెనో ఎత్తుకొన్న గద్యము ఎంత పరిమాణములో నుండవలెనో పద్యగద్యముల సంధులెటులు తీర్చవలెనో ఏతాదృశ రచనా రహస్యవిద్యా సమున్మీలనమునకు నన్నయ మూలశిల్పి. "ఆంధ్రకవిత్వ విశారదుం" డన్న వెంట "విద్యాదయితుం" డని తిక్కన చెప్పుటలో నుద్దేశమేమి? గద్యపద్య రచనావిద్యకు ఆయన దయితుఁ డనుటయేకదా!

ఇఁక, తిక్కనగారి పద్యము లించించుక మార్చుకొనుచు వచనశైలిలో వ్రాసికొనిపోఁగా నదియొక మహాగద్య గ్రంథము. శ్రీ వీరేశలింగముగారికి "గద్యతిక్కన" యను బిరుదమున్నది. దానికి దాతయెవరో కాని మంచి పరిజ్ఞాత. తిక్కనగారు ప్రత్యేకమైన వచన గ్రంథము వ్రాసినవారుకాదు. పయిపెచ్చు నిర్వచనముగా నుత్తర

రామాయణము వ్రాసెను. మఱి, భారతములో నడుమ నడుమ గద్యములనుబట్టి యతఁడందు లోకోత్తరుఁడనియు వీరేశలింగముగారు నేఁడు తిక్కనవంటి వాఁడనియు ఈ బిరుదమునకు జెప్పవలసిన యన్వర్థత యగునా? ఇట్లు తోఁచుచున్నది.

నన్నయ పద్యవిద్యకువలెనే తిక్కన గద్యవిద్యకు ఆద్యోపదేష్ట. నన్నయ గద్యమును సైతము పద్యముగాపాడి చూపించెను. తిక్కన పద్యములో వ్యక్తవాఙ్మధురమైన గద్యము నుపన్యసించెను. వారి గద్యపద్యములు రెండునుగలసి మహాకవిత్వము. ఆంధ్రకవిత్వ విశారదత్వమున వారిరువురు సగర్వ్యులు. పద్యము ఫలభూమి. గద్యము కర్మభూమియైనచోఁ గర్మభూమినుండి ఫలభూమికిఁ జేర్చువాఁడు నన్నయ. దేవభూమిని తెలుఁగు పుడమిలోఁ దిలకింపఁజేసినవాఁడు తిక్కన. నాకలోక వాసియైన తండ్రిని తనదగ్గఱకు రప్పించుకొనఁ గలిగినాఁడు.

తిక్కన గద్యశైలీరీతి యెట్టిది! సమాపక్రియా పదబాహుళ్యము ఆయనరచనలో నొకయొడుపు. గొలుసుకట్టుతనమునకు క్త్వార్థకము లుపయోగించుచు, తిక్కన యెక్కడి కక్కడ తెగ దెంపులు చేయును. సుదీర్ఘ వాక్యములు చేయఁడు. మహామంత్రిగా నుపన్యసించుచున్న రీవి ఆయన పద్యగద్యములలోఁ గనఁబడును. ఆధునిక కాలమున వచనరచనలో నెన్నో పోకడలు వచ్చినవి. ఆయన్నింటికి నాదిశిల్పము తిక్కనగారిది. ఈ పద్యము చూడుడు.

డప్పి జనించె; వ్రేళుల పుటంబులు పొక్కఁ దొడంగె; గోళ్ళలోఁ
జిప్పిలఁజొచ్చె నెత్తురులు; చిత్తమునాకుఁ గడు న్వశంబుగా;
దప్పుర మిచ్చటచ్చటను నాసలవచ్చితి; నెంత దవ్వొకో!
యిప్పటిభంగి నొక్కఁడుగు నేఁగెడుదానికి నోర్వ నెమ్మెయిన్.

ఈ పద్యమున ఆఱు-ఏడు సంపూర్ణక్రియలున్నవి. ఒకొక్కటి ఒక్కొక్క వాక్యము. ఇవి ఛందస్సులోఁ జూపించిన యొక సుకుమార

మైన గద్యపద్య. నేఁటి నిపుణుఁడైన వచనరచయిత ఈమాదిరి వామన వాక్యములు వ్రాయుటకు ముచ్చటపడును. వేఱొక కవి "డప్పిజనించి వ్రేళులపుటంబులు పొక్కి... గోళ్ళలో నెత్తురుచిమ్మి..." అను రకముగా క్త్వార్థకములు వాడి అవిచ్ఛిన్నపద్య భావధారకు 'పాడి' యొనర్చితినని సంతోషపడును. ఆ శైలి సొగసు, ఈ శైలి నెరసు అనుటకుఁగాదు. తిక్కనగారి పద్ధతి యిది.

ఇమ్మదిరాక్షి డస్సె; మనకీ నడుమన్ విడియంగ నొండుచో
టిమ్మునుగాదు నిక్కముగ కేమును డస్సితి, మట్లుగాన నీ
వెమ్మెయినైన దీని భరియించి పురంబు సమీప భూమికిన్
దెమ్మని చెప్ప నాతఁడును దెచ్చెఁ బ్రియుంబునఁ బుష్పకోమలన్.

"ఈమె యలసినది. ఈనడుమ విడియుటకు మనకు వేఱొకచోటు అనుకూలముగాదు. నిజమునకు మేమును అలసితిమి. నీ వెటులైన ఈమెను పురసమీపమునకుఁ గొనిరమ్ము..." ఇది క్రియాపద భూయిష్ఠమైన గద్య రచనతీరు.

పగ యడఁగించు టెంతయు శుభం; బది లెస్స యడంగునే పగన్
బగ వగ గొన్న మార్కొనక పల్కక యుండఁగ వచ్చునే? కడున్
దెగ మొదలెత్తిపోవఁ బగదీర్పఁగ వచ్చినఁ గ్రౌర్యమొందు; నే
మిగతిఁ దలంచినన్ బగకు మేలిమి లేమి ధ్రువంబు కేశవా!

ఇది శతవృద్ధ మాజనని యిప్పుడు మృత్యువుఁ బొందె, నిట్లు సే
యుదుము కులప్రయుక్త మగుచున్న సనాతన ధర్మ మిత్తెఱం
గ దహనకర్మ మెల్ల; మదిగా నిదిగా మును నిశ్చయించి మా
మొదలిటివా రొనర్చువిధముం గొనియాడితి మేము నిర్వ్యేడన్.

ఈ పద్యములు వ్యక్తవచోబంధ మాధురీ సగంధములైనవి. ఈ రచనతీరు క్రొత్తది. క్రియాపద బహుళమై శకల శకలములుగా నున్న లఘువాక్యములతో ఒక మహాభావమునందు తాత్పర్యము చెప్పెడి

పద్ధతి గలది "గద్యశైలి" యనుకొన్నచో ఆ పోకడకు తిక్కనగారిదే యొరవడి.

నన్నయగారి ఇట్టి రచనాఫణితి భట్టారకులవారిలోను లేక పోలేదు. ప్రాచుర్యమును బట్టి చూచుకోవలెనుగదా!

వాఁడి మయూఖముల్ గలుగువాఁడపరాంబుధిఁ గ్రుంకె, ధేనువుల్
నేఁడిట వచ్చె నేకతము, సిద్ధమెయిన్ భవదగ్నిహోత్రముల్
పోఁడిగ వేల్వఁగాఁ బడియెఁ బ్రొద్దునుబోయెఁ గచుండు నేనియున్
రాఁడు, వనంబులోన మృగరాక్షస పన్నగబాధ నొందెనో!

ఈ పద్యములో అయిదాఱు పొట్టివాక్యము లున్నవి. ఇవి యన్నియు దేవయాని పరిదేవన భావమును ప్రకటించుటలో పర్యవసన్నమగుచున్నవి. లఘువాక్యములు నాదఖండములు. అవి వ్యక్తములు. అవ్యక్తనాదమునందు వానికిఁ బర్యవసానము. అవ్యక్తము అఖండము. ఇపుడు గద్యము వ్యక్తవాక్కు. అది ఖండము. పద్యము అవ్యక్తవాక్కు. అది అఖండము. ("గద వ్యక్తాయాం వాచి"-గద్యతే (భ్వాది) పాదాః సన్త్యస్య అన్యే భ్యోఽపి-ఇతియప్, గద్యపద్యాకృతౌకవేః)ఇది వేదాంతము కాదు. గద్య పద్య శబ్దముల పుట్టుపూర్వోత్తరములు ఈ యర్థమును చాటుకొనుచున్నవి.

పద్యము ప్రకాశస్వరూపము. గద్యము విమర్శ స్వరూపము పద్యము మొగ్గ. గద్యము పువ్వు; పద్యము పరమశివుఁడు. గద్యము విరాట్పురుషుఁడు, గద్యపద్యములు ప్రకృతి పురుషులు, ప్రయోగోప సంహారములు —

ఇటులు లోలోనఁ జొచ్చుకొని చూచినచోఁ దెలుఁగు కావ్య సారస్వత భవిష్యదభ్యుదయమునకు నన్నయ తిక్కనలు కూడఁబలుకుకొని ఏకనాళావలంబి ఫలయుగళముఁ బోని తమ తమ ప్రత్యేక శైలులతో అమృతభిక్ష ననుగ్రహించిరే కదా!

# నన్నయగారి వెన్నెలరేయి

ఈ ప్రాయసము ఒకనాఁటి మధురానుభూతికి సంబంధించిన అక్షరవిన్యాసము. బ్రహ్మానందానుభూతి అస్మదాదుల కందనిది. మఱి, రసానందము బ్రహ్మానంద సబ్రహ్మచారి గదా! రసానందానుభవము కూడ అందాఁక గ్రంథస్థమే. ఇపు డటులు కాదు. ఈ తొలిపలుకుతో అసలుగ్రంథ ముపక్రమించెదను.

ఆంధ్రమహాభారతమున అరణ్యపర్వములో నాల్గవ యాశ్వాసమున "శారదరాత్రు లుజ్జ్వల లసత్తరతారక...". ఇత్యాది పద్యముతోఁగదా, నన్నయభట్టారకుని గంట మాఁగినది! ఈ విషయమున మనకు సాంప్రదాయికమైన శబ్దమే ప్రమాణము. పదిమంది పరిశీలకులలో నెవరో యొకరు మాత్రము అరణ్యపర్వము సాంతము నన్నయ కృతమే యనియు, అది యఖిలము తిక్కననాఁటి కుండి ప్రెగ్గడనాఁడు కడమ పద్యగద్యములు కొన్ని కొఱుకుడుపడియుండవచ్చుననియు, అపుడు ప్రెగ్గడ తద్రచనయకా నారణ్యపర్వశేషము పూరించి యుండు ననియుఁ జెప్పిరి. నేఁ డీయభిప్రాయము కలవా రెందఱుందురు? పెక్కుమందితోపాటు నాకును బయివాదము సంవాదముగాఁ దోఁచలేదు.

"శారద రాత్రులు" అను ఉత్పలమాలలోఁ జుట్టుకొని నన్నయ గంటము మఱి కదలలేదు. అరణ్యము పూర్ణముగా నతఁడు రచించియే యుండలేదు. ఇది యందఱివలె నేను పరిశోధన వైభవమున నిశ్చయించుకొన్న యభిప్రాయము కాదు. అనుభూతిప్రాభవమే యీ నిర్ణయమునకు అవలంబమైనది. ఈ నా యనుభూతి పెద్దలముందు పఱచెదను. దానితోఁగాని ఆనందముతో నిండిన నా గుండెబరువు తేలికపడదు.

అసలు కథ :- పాండవులు హిమాచలమున దేవర్షి బ్రహ్మర్షి యజ్ఞప్రదేశములు అనేకవిధ యూపములు చూచుచు నొక సంవత్సర కాలము నివసించియుండిరి. ఆ వత్సరమున నొకసారి భీముఁడు ఒంటరిగ వేటకుఁ బోయినపుడు పన్నగమొకటి యతనిని పట్టి బంధించెను. వృకోదరుఁ డనఁగా, సాధారణుఁడు కాఁడు. పదివేల యేనుఁగుల బలముగల జగజెట్టి. తాదృశుఁడుకూడ ఒక దందశూకముచే బంధితుఁడగుట ఆశ్చర్యము. అక్కడ, ఆశ్రమస్థుఁడగు ధర్మరాజు తనసోదరుఁడింతదాఁక రాకపోవుటచే వెఱచి, వగచి, యాతని యన్వేషణమునకు బయలుదేరెను. భుజగశరీర వేష్టితుఁడై కదలనేరని తమ్మునిఁ బరికించెను. నా సోదరు నేల బంధించితివని యజగరము నడిగెను. ఆమిషార్థివై ని సట్టినచో నీ యాఁకలి తీఱునట్లు మృగమాంసము బెట్టుదును ్వుమని బతిమాలెను. అపుడు, అజగరము తన చరిత్ర నిటుల ధిష్ఠిరునియెదుట విప్పెను.

''నేను మీ పూర్వకులజుఁడను. ఇంద్రసదృశుఁడను. భాగ్యదర్ప న సప్తఋషులచే బ్రహ్మరథము పట్టించి అగస్త్యు నవమానించితిని. ఋషి కోపించి ఉగ్రాహివగుమని నాకు శాపమిచ్చెను. తచ్ఛాప వశమున మహేంద్రపదవినుండి పరిభ్రష్టుఁడనైతిని. శాపవిముక్తికై యగస్త్యుని వేఁడుకొనఁగా అతఁడు నాకొక వర మనుగ్రహించెను. నే నడిగిన ప్రశ్నలకు సరియైన ప్రత్యుత్తరము లెవఁడు చెప్పునో వానివలననే నా శాపమునకు విడుదల. నా చరిత్ర యిది. నిన్నుఁ గొన్ని ప్రశ్న లడిగెదను. వానికిఁ దగిన జవాబులు చెప్పెదవేని, నీ తమ్ముఁడు నీకుఁ దక్కును.'' ధర్మరాజు అయ్యజగరము వేసిన ప్రశ్నలకుఁ బ్రత్యుత్తరములు చెప్పలేనివాఁడు కనుకనా ? ప్రతి ప్రశ్నమునకు ఉచితముగా సమాధానములు చెప్పివైచెను. ఆనహుష ప్రశ్నలెల్ల అధ్యాత్మవిదులకు మాత్రమే గోచరించు పరమరహస్యములు.

ఈకధతరువాతి గద్యపద్యములు ఉన్నవి యున్నటులు నన్నయ భట్టారులవారివే క్రిందఁ జూపించుచున్నాను. ఇవి యెదురుగా నున్నప్పుడుగాని, నాకధనము మనస్సునఁ బట్టకపోవచ్చును

వ. తన చేసిన ప్రశ్నంబులకుఁ బ్రత్యుత్తరంబులు వలికిన ధర్మనందనున కతిప్రీతుండై భీమసేనుని విడిచి శాపవిముక్తుండై దివ్యరూపంబు సేకొనియున్న నహుషుం జూచి ధర్మతనయుండు సంతోసిల్లి యతనివలన నధ్యాత్మ రహస్యంబు నిమ్ముగా నెఱింగి యుధిష్ఠిరుండు వృకోదరుం దోడ్కొని నిజాశ్రమంబునకు వచ్చియున్నంత.

క. ఖర కిరణ తాపమున నురు
తర దవదాహమున శోషితములైన వనాం
తర తరు తతి కాప్యాయన
కరమై వర్షాగమంబు గడు బెడఁ గయ్యెన్

క. నాలుగు వలఁకుల నవ ఘన
జాలంబులు వ్రాలి కురిసె ఝంఝూనిల వే
గాలోలములై బహుల
స్థూలపయోధార లోలిఁ దుములంబులుగాన్

క. ఘనతర నైశతమంబొకొ
యనఁగ ఘనాగమతమిస్ర మవికలమై క
ప్పిన జనులకు వస్తువిభా
వన మొక్కొక యెడలఁ గలిగె వైద్యుత రుచులన్.

చ. అరుదగు తత్పయోద సమయంబున నొక్కట విస్తరిల్లె నం
బరమున నంబుదధ్వనియుఁ బల్వల భూముల భూరిదర్దురో
త్కర రవముల్ మహీరుహ శిఖాంతములందు శిఖండితాండవాం
తర మద మంజులస్వనము దా నతిరమ్యమునై వనంబునన్.

చ. దళిత నవీన కందళ కదంబ కదంబక కేతకీ రజో
మిళిత సుగంధబంధుర సమీరణుఁ డన్ సఖుఁ డూచుచుండగా
నులియుచు మొల్లగుత్తులను నుయ్యెలలూగ్ప్ప నెక్కియూఁగె ను
ల్లల దళిసీకులంబు మృదులధ్వనిగీతము విస్తరించుచున్.

క. సురచాప చిత్రగగన
స్ఫురణాం బురుణించునట్లు భూవనిత నిగం
తరచిత్రితమై యొప్పెను
సురుచిర నవతృణశిలీంధ్ర సురగోపములన్.

వ. తత్సమయానంతరంబున

ఉ. భూసతికిన్ దివంబునకుఁ బొల్పెసఁగంగ శరత్సమాగమం
బా సకల ప్రమోదకరమై విలసిల్లె మహర్షి మండలో
పాసిత రాజహంసగతి భాసి ప్రసన్న సరస్వతీక మ
బ్జాసన శోభితం బగుచు నబ్జజయానముతో సమానమై.

ఉ. శారదరాత్రు లుజ్జ్వల లసత్తర తారక హారపంక్తులం
జారుతరంబులయ్యె వికసన్నవ కైరవ గంధ బంధురో
దార సమీర సౌరభము దాల్చి సుధాంశు వికీర్యమాణ క
ర్పూర పరాగ పాండురుచిపూరము లంబరపూరితంబులై.

నన్నయభట్టు కవిత్వము సంపూర్ణము.

పయికథలోని సారము భావనచేసికొని, మనచూపు ఒక ఆధ్యాత్మి కోన్నత సోపానమున నిలుపుకొందము-నన్నయభట్టారకుఁడు మోక్ష కాంక్షగల మహాయోగి. ఆమహాత్ముని నిర్యాణము నిర్వాణపర్యవసాయి. భారత రచనలో అరణ్య పర్వమున, తురీయాశ్వాసమున, అజగరో పాఖ్యాన ఘట్టమువెంట నాతని గంట మాఁగినదనుటలో సత్యమున్నది.

ఇటు చూడుఁడు. ఆదిపర్వము బ్రహ్మచర్యాశ్రమము. సభాపర్వము గార్హస్థ్యము, అరణ్యపర్వము వానప్రస్థము – అని స్థూలదృష్టితో అను కొందము. ఇపుడు భారత కథాఘట్టమునఁ బాండవులు హిమాచలమున వానప్రస్థదీక్షలోనున్నారు. క్షత్త్రియులగు పాండవులకిఁక వానప్రస్థమును దాఁటిన యాశ్రమముపై నధికారములేదు. అధ్యాత్మరహస్యవేదియగు యుధిష్ఠిరుఁడు ఏతత్కథా సందర్భమున నిజాశ్రమస్థుఁడు. అతఁడు పరమ ధన్యుఁడు. మరలగాథాసంసారములో దింపుట నన్నయ మహర్షి కభిమతము కాదు.

సరిగా, యుధిష్ఠిరుని వానప్రస్థముతో భట్టారకుల తురీయాశ్రమ స్వీకారము జరిగియుండును. చతుర్థాశ్వాసము చతుర్థాశ్రమమునకు మాఱుపేరు. తదాశ్రమస్థుఁడగు విప్రోత్తముఁడును పరమ ధన్యుఁడు. నన్నయభట్టారుఁడు నేఁడు కర్మసన్న్యాసి; ముముక్షువు. "యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్" – భారతనాయకుఁడగు యుధిష్ఠిరుఁడు – భారత గ్రంథకర్త నన్నయభట్టారకుఁడు – ఇరువురును స్వస్వ విహిత చరమాశ్రమస్థితులు.

నన్నయస్వాముల కిఁక ముక్తి సంపద సమీపించుచున్నది. ఈతూరి యతని చరమకవితా ఘట్టము నర్థము చేసికొందము.

౧) భట్టారుని యవయవము లితఃపూర్వము ఖరకిరణ తాపమున, నురుతర దవదాహమున శోషితములైనవి. అనఁగా, అంతర్బహిస్తాపతప్తత సూచితము. నన్నయ తప్తావయవములకుఁ దృప్తిప్రదముగా నమృతవర్షము పడినది. అపును సర్వసంగత్యాగి యగు భట్టారున కంతకుమించి కావలసిన దేమి!

౨) నాల్గు దెసల మబ్బులు క్రమ్మినవి. ఝంఝానిలము విసరినది. ఆగాలితాఁకున కుంభవృష్టి పడినది. ఈ పద్యమున మోక్షపూర్వావస్థ ధ్వనితము.

౩) ఘనతర నైశతమం బొకో యనఁగ ఘనాగమ తమిస్రము కప్పిన దఁట. ఇక్కడ నొక్క-చిత్రము. నైశము అనగా అవిద్య. ఈశ సంబంధి ఐశము. న+ఐశము–నఞర్థకేన నశబ్దేన సుప్సుపేతి సమాస :- నైశము. అవిద్యా రూపమైన తమస్సులో నడుమనడుమ మెఱపు మెఱయిక లఁట. ఇట్టిది యౌగికమైన యొకానొక యనుభూతిసాంద్రత.

౪) "అరుదగు తత్ప్రయోద సమయంబున నొక్కట విస్తరిల్లె సంబరమున నంబుదధ్వని" అంబుదధ్వని రహస్యము హంసోపనిషత్తు ఇటులు చెప్పుచున్నది. "చిణీతి ప్రథమః చిణిచిణీతి ద్వితీయః ఘంటానాద స్తృతీయః శంఖనాద శ్చతుర్థః పంచమ స్తంత్రీనాదః షష్ఠస్తాళనాదః సప్తమో వేణునాదః అష్టమో భేరీనాదః సప్తమోమృదంగనాదః దశమో మేఘనాదః దశమం చ పరబ్రహ్మ భవేద్బ్రహ్మాత్మసన్నిధౌ"

యోగికి దశమావస్థ మేఘనాదశ్రుతి–దానితో నతనికి బ్రహ్మభూయము. మఱి కర్మబంధముల దందడి యతనికి లేదు. తన్మహనీయావస్థ కించుకముందు చెట్లపై నెమళ్ళకేకలు, పల్వల భూముల కప్పకూఁతలు వినఁబడుటయనఁగా, అవి క్షుద్ర క్షుద్రతర కర్మవాసనల కడవెలుఁగులను సూచించుచున్నవని గుర్తింపవలెను.

౫) బ్రహ్మశ్రీ మూర్తి నన్నయ భట్టారునకు మేఘనాదముతోఁ గలియు సుయోగము పట్టనున్నది. మేఘనాదోదయోత్తర క్షణమున కడిమిపూలు, మొగలిపూలు నిండుగా విచ్చి, అ విచ్చిన పూలమీఁది నుండివచ్చిన నెత్తావిగాలి భట్టారునకు నెచ్చెలియైనది. ఆమహాయోగి మొల్లగుత్తుల యూయెలపై సవిలాసముగ నూఁగుచున్నాఁడు. ఆజీవన్ముక్తునకు 'మధుర కవితా ధ్వనిగీతములతో విలీనత సంభవించినది.

౬) ఉన్నతోన్నతమైన బ్రహ్మభూయమున లోకమెట్లుభాసించును ? అది రంగురంగుల ఇంద్రధనుర్లతిక. ముక్తుని దృష్టిలో భూవనిత

చిత్రిత. దాని చిత్రణములుకాని రంగులుకాని శాశ్వతములు కావు. మఱియు, ఈ భూమి పుట్టగొడుగుల పుట్ట. సురగోపములతుట్ట. ఇంక, ఆ యెత్తునుండి చూచినచో ఈ నేల దిక్కుమాలినది. ఈ విషయము "సురచాప చిత్ర గగన" ఇత్యాది పద్యమున ధ్వనించును.

౭) పురుషోత్తముఁడగు భట్టారకుఁడు ఆనందఘనుఁ డాయెను. కర్మబంధము అతనిని వదలెను. ఆ శుభసమయమున నింగికి నేలకు నొకటే వెన్నెల. ఆ వెన్నెల ఆసకలప్రమోదకరమైనది. ఎట్టి పరమ హంసతాసిద్ధికి మహర్షి మండల మేండ్లుపూండ్లు ఉపాసనచేయుచుండునో, అట్టి పుణ్యసిద్ధి నన్నయ భట్టారకున కిపుడు లభించినది. ఆ లాభము ప్రసన్నసరస్వతీ ప్రసాదమువలనఁ దటస్థించినది "ప్రసన్న కథాకలి తార్థయుక్తి లోనారసి" అను నవతరణికలోని మాట నీయవసానపు ఘట్టముతో సమన్వయము చేసికోవలయును.

పరమహంసను గూర్చి ఉపనిషత్తు ఇటులు ఉట్టంకించుచున్నది. "లోకే పరమహంస పరివ్రాజకో దుర్లభతరః యద్యేకోఽస్తి స ఏవ నిత్యపూత స్స ఏవ వేదపురుషో మహాపురుషో యస్తచ్చిత్తం మయ్యే వాఽవతిష్ఠతే"

పరమహంస స్వరూపుఁడగు నన్నయ మహాకవిమాత్రుఁడు కాఁడు. అతఁడు నిత్యపూతుఁడు, వేదపురుషుఁడు, మహాపురుషుఁడు, "విద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టుదక్షతన్" అని తిక్కన సోమయాజి నన్నయభట్టారుని గూర్చి ఉపయోగించిన విశేషణ దళములు సరిగా, పరమహంస పరివ్రాజకోపనిషత్సూక్తులతోఁ జుట్టఱికము గలవి.

మఱియొక ముచ్చట నన్నయస్వామి ప్రథమ చాతుర్మాస్య దీక్షానంతరము ముక్తుఁడయ్యెననుటను "శారద రాత్రులు" అను చరమపద్యము సూచించును. తెలుఁగువారి వెన్నెలరేయి కా వెలుఁగు, కావ్యతారకల కా సొబగు నన్నయభట్టారుల ముక్తిప్రభవలననే.

ఆంధ్రకవితామాత మెడలో నన్నయ మహోదయుఁడు వేసిన "ఉత్పలమాల" శారద కౌముదీరోచిస్సులతో నిండుగా విచ్చి నవ్వుచున్నది.

"రాజకులైక భూషణుడు రాజమనోహరుఁడు" అన్నది తొలి యుత్పలము. "శారదరాత్రులు" అన్నది నన్నయ కవితాభాగములో తుది యుత్పలము. ఈ రెండు ఉత్పలముల నడుమ తాను విరియింపఁ జేసిన తెలుఁగు కబ్బపు వెన్నెలకారులో నన్నయభట్టారకులను ప్రవేశము చేసిరి. ఆద్యంతోత్పలములందు శరదిందుచంద్రికా ప్రసంగ మంగళము అది దైవికము. ఆర్ష వాగ్విశేషము.

భారతము చంద్రవంశీయుల యితిహాసము. రాజమహేంద్రుఁడు చంద్రవంశీయుఁడు. మఱి - ఉపక్రమోప సంహృతులయందు చంద్ర చంద్రికా స్మరణాభివర్ణన రూపకల్యాణము అనపాయియైనది. చంద్రిక సరస్వతీ శబ్ద పర్యాయము.

చంద్రవంశీయేతిహాసము చంద్రాధిదేవతాకమగు భగణము తొలుతఁ గలిగిన వృత్తముతో నుపక్రమము సేఁత తెలుఁగుజాతికి చేతోహ్లాదకము.



# శ్రీనాథుని
# కవిసార్వభౌమంత

ఆంధ్రసాహిత్య ప్రపంచమున శ్రీనాథుఁడు శ్రీనాథునివలె స్థితి మూర్తి. కవిత్రయము తరువాత మరల నంతటి ధీమంతమైన దీప్తి మంతమైన బ్రాహ్మీ వరప్రసాదముగా శ్రీనాథుఁ డవతరించినాఁడు, తెనుఁగుకవిత్వము చతుర్వర్గఫలప్రాప్తి హేతువన్నమాటకు శ్రీనాథుని కృతులు పర మోదాహరణములు. కవి కుటుంబము పాలిటి "దివిజసురభి" యైనభాషావధూటిని తనహృదయక్షేత్రమున నిలుపుకొన్న యుపాస కుఁడు శ్రీనాథుఁడు.

అదిగో! శ్రీనాథసరస్వతీకంఠపీఠికయందు మెరయుచున్న ఓంకార ఘంటాసువ్యక్తనాదములుగా ఆంధ్రనైషధము, భీమేశ్వర పురాణము, కాశీఖండము, హరవిలాసము, శివరాత్రిమాహాత్మ్యము శ్రుతిరసాయనము చేయుచున్నవి. మఱియు, మరుత్తరాట్చరిత్రము, శాలివాహన సప్తశతి, పండితారాధ్యచరిత్రము, నందనందనశతకము, ధనంజయవిజయము, ఇత్యాదులు కృతులు తదవ్యక్తనాదములుగా స్మృతిగోచరము లగుచున్నవి. క్రీడాభిరామము, పలనాటివీరచరిత్రము ఈ రెండును వ్యక్తావ్యక్తమధురమైన తత్ప్రణవఘంటాఘోషములుగా వినఁబడుచున్నవి.

శ్రీనాథుని కావ్యములలో ఏఘట్టమునకు వచ్చినను, దివిజవాహినీ లహరులలో అఘమర్షణాభిషేకము చేసికొన్న సుచిరానుభవము కలుగును. ఏ పద్యము పట్టినను హరిణాంకవక్రరేఖతోఁ గరస్పర్శచేయు చున్న రుచిరానుభావము కలుగును. కవిసార్వభౌముని కావ్య మనఁగా, అనల్ప రమణీయ శిల్పోన్మీలన ప్రచురమైన నీలలోహితుని జటా జూటము! సంస్కృతభాష యందలి ప్రౌఢి, ఆంధ్రభాషయందలి పలుకు నుడికారము, ఉభయభాషా వచస్సమ్మేళనము శ్రీనాథుని కావ్యములకు ముత్యాలత్రిసరములవలె ముసుపుసూపు నలంకారములు.

సత్కావ్యము లనఁగా నెట్టివో ఆయన చెప్పినమాటయే.

"హరచూడాహరిణాంకవక్రతయుఁ గాలాంతస్ఫురచ్చండికా
పరుషోద్గాఢపయోధరస్ఫుటతటీపర్యంతకాఠిన్యమున్
సరసత్వంబును సంభవించె ననఁగా సత్కావ్యముల్."

ఈశ్వరార్చనకళాశీలము బ్రహ్మజ్ఞానకళానిధానము నైన శ్రీనాథుని కావ్యాత్మ పరమశివప్రసంగము వచ్చి పరవశ మగుచుండును. తన కవితా శిల్పారంభమున శ్రీనాథుఁడు కపర్దిని మైవపుముద్దగాఁ జేసికొనెను ఆయనచేతిలో నీరూపుఁ దైనకపాలధారి కెన్నో సుందరావతారములు. ఎన్నెన్నో సురుచిర వేషములు—

"గజచర్మ మెన్నఁడో కాని నిచ్చలుఁ గట్టు
పసిఁడికమ్ములపట్టుపచ్చడంబు
భసిత మెన్నఁడో కాని ప్రతిదినంబు నలందు
మలయజంబు కురంగమదము గూర్చి
నిడుదపాములరాజుతొడవు లెన్నఁడో కాని
తారహారములు నిత్యము ధరించు
నృకరండరుండమాలిక లెన్నఁడో కాని
ధరియించుఁ గల్హారధామ మెపుడు
కాటినడుచక్కి నెన్నఁడోగాని యుండు
దక్షవాటి సువర్ణసౌధములమీఁద
నెన్నఁడో పిశాచులనుగాని యిందుముఖుల
నెల్లకాలంబుఁ దలంచు భీమేశ్వరుండు.

శ్రీకంఠుఁడో శ్రీనాథుఁడో! కవిసార్వభౌమునిశిల్పములో మన కాభేదముగోచరింపదు. పెద్దగుబ్బలిరాజు పెండ్లికొడుకు, బాలతారకావిట మకుటావతంసుఁడు-జటారుద్ధశశి-తరుణేందు శేఖరుఁడు - మంగళజ్యోతిర్లింగమూర్తి - అర్ధేందూత్తంసుఁడు — కోమలైందవతనుఁడు -

ఫణికుండలుఁడు-ఓహో! సత్యము సుందరము నైన ఎట్టి సాక్షాత్కృతి! తాదృక్స్వారవశ్యములో శ్రీనాథపూజ్యపాదులనుండి వెల్లివొడిచిన కవిత్వము శృంగారాదిసర్వరసభంగీశబలితమై రసికహృదయాసేచనక మగుటలో ఆశ్చర్యమేమి? "దక్షపురిసానికూఁతులఁ దవిలినాఁడు" అనియు, "భీమేశుఁడు సానివాడ కరుగున్ ధూర్తప్రకారంబునన్" అనియు శ్రీనాథుఁ డనుట అది యొక కవితాలీలాకైవల్యము!

కవిసార్వభౌముని పలుకుబడిలో అను పదము ఒక వైశిష్ట్యము రసజ్ఞులు భావింతురు. ఆయనది అన్నపూర్ణాపాణి. ఆయన కావ్య రసాస్వాద మనఁగా - పాయసాపూపసంపన్నము, కలమాన్నపూర్ణము, రంభానారికేళఫలశాకసాకల్యము ఆజ్యధారాఘుమఘుమితము, శర చ్చంద్రచంద్రికాధవళ చిక్కణదధిసమృద్ధము నైనభోజనమహోత్స వము. క్షుధార్తుఁడైన వ్యాసునకు ఆయన పదివేలమందిశిష్యసందోహ మునకు అన్నపూర్ణ అనుగ్రహము కలిగి అభ్యవహారభిక్ష పెట్టుదును రమ్మనెను.

"ఎవ్వఁ డేపదార్థ మెంతేని చింతించు
నతని కాపదార్థ మంత కలిగి
అరటియాకులోన నవతార మైయుండు
నిట్టిమహిమ చూడ మెన్నఁడేని"

మన కవిసార్వభౌముని పదార్థసంభారసంపన్మహిమయు నంతటిదే. అది నీటికొలఁది తామర. ఎవఁ డేకాంక్షతో భావించిన, అతని కాకాంక్ష నంతంత పండించెడి అనంతశక్తి శ్రీనాథుని కవిత్వములో నున్నది. రీతిరామణీయకము, వృత్తిమనోజ్ఞత, అలంకారప్రాభవము, భావోచ్ఛ్రితి, రసావిష్కృతి, వ్యంగ్యవైభవము ఇత్యాది సాహిత్య సంపద యంతయు ఆయన కావ్యభండారమునుండి చూఱాడవచ్చును.

శ్రీనాథుని యనువాదసరణి దాని కది స్వతంత్రము. మూలాభిప్రాయసమాహరణము, ఔచిత్యాదరణము, అనౌచితీనిరాకరణము, అలంకారభూషణము, భావరసపోషణము - ఇవి యన్నియుఁ గవిసార్వభౌముఁ డనువాదమునఁ గయికొన్న వ్రతములు. ఆయన చేతిలో విద్వదౌషధమైన నైషధము స్వతంత్ర కావ్యముగా రాణింపఁగలిగినది. రాణించి, మనీషి హృదయశ్రీహర్ష దాయకమైనది. ఉదాహరణ మొక్కటి · రాజహంస దమయంతికి వలయునని పట్టువడినది. ఆమె నలమహారాజు ప్రసంగము తెచ్చి, అతనియెడల నేను మిగులఁ బక్షపాతము కలిగియుందు నని యిటు లనుచున్నది :

"కనకశైలంబు డిగ్గి యాకాశసింధు
సలిలముల దోఁగి మిగులంగఁ జల్లనైన
చారుహాటకమయగరుచ్చామరముల
వీతు నతనికి వైశాఖవేళలందు."

నలునిసురతశ్రమాపనోదనమునకుఁ బక్షవీజనములతో వీతునని మాతృకాశ్లోకము చెప్పుచుండఁగా, "వీతు నతనికి వైశాఖవేళలందు" అనుట తత్కాలౌచితీసుందరమైన భావముకదా! ఇది లోకసామాన్యము; ఎఱిఁగిన విషయము. అదికాదు. "చారుహాటకమయగరుచ్చామరములు" అన్నచోట సంధితఃప్రాప్తమైన గరుచ్చామర శబ్దములోని చకారద్విత్వము ఉభయచామరశ్రీవ్యంజకమై రసికరంజనము చేయుచున్నది. ఇది శ్రీనాథుని యనువాదశక్తి-స్వతంత్రలీలకుఁ జిరత్నమైనదే యైనమచ్చు.

కవిసార్వభౌముని రచనలోని సంస్కృతాంధ్రపదసంవాదము క్షీరనీరసన్నిభమైనది.

"మర్త్యభామలు విబుధభామలును గలసి
యుత్సవములందు వర్తించుచున్నయపుడు
దక్షవాటంబువీట భేదంబు తెలియు
దృగ్జ్ని మేషానిమేషప్రదీప్తివలన"

దక్షవాటములో శివోత్సవసమయమున మర్త్యకాంతలు, అమర్త్యకాంతలు కలసి తిరుగుచున్నారు. ఎవరు మనుష్యకాంతలో, ఎవరు అమర్త్యభామలో తెలియరానంత సారూప్యము వారిది. ఱెప్పపాటు ఉండుట - లేకుండుట - అనుదానివలన మర్త్యామర్త్యభేదము తెలియుట జరుగుచున్నది. కవిసార్వభౌముని సంస్కృతవాక్కునకు, తెనుఁగుపలుకుబడికి వేర్పాటులేదు. ఉన్నదో, దృష్టిమేషాంతరమంత యంతరము ! ఆయన తెనుఁగు పలుకుబడి :

> "ఒకానొకసరి వసంతకాలమునఁ గోయిల క్రోల్చినభంగి నేడ్చె న
> బ్బిసరుహనేత్ర కొండచఱిఁ బెద్దయెలుంగున వెక్కివెక్కి వె
> క్కసమగుమన్యువేగమునఁ గాటుకకన్నులనీరు సోనలై
> యుసిరికకాయలంతలు; పయోధరముల్ దిగజారునట్లుగన్."

కళావతీతత్కాలశోకాభివ్యంజకమైన యిందలి తెనుఁగుపదముల మసృణత్వము - వసంతకాలము, బిసరుహనేత్ర, మన్యువేగము, పయోధరముల్ - ఏతాదృశతత్సమములలో ఆ తెనుఁగుకలయిక హృదయద్రుతి నొదవించుచున్నది.

తనతరువాతిప్రబంధకవులకు అనుసరణీయములు రమణీయములు నగు నైకవిధపద్యశైలీవిన్యాసములకు శ్రీనాథుని సీసము లనుమాట ఊరక పుట్టినది కాదుకదా ! సీసములందు ఆయన చూపినగతివిశేషములు రసవిదులకుఁ గ్రొత్తచూపవలసిన యక్కఱలేదు.

అదియటుండె : తెనుఁగుకవులలో శ్రీనాథునంతటి శాస్త్రవ్యుత్పత్తి బలముకలవారినేకులులేరు. శ్రుతిపురాణాగమస్మృతిసాంఖ్యసిద్ధాంతాభిజ్ఞత, పాతంజలమహాభాష్యసమభ్యాసపాటవము, న్యాయశాస్త్రకౌశలము, భాషాపరిజ్ఞానము, అంతటి వైదుష్యసాగరమును మేధామంధానముతోఁ ద్రచ్చి ప్రతిభామృతకలశమును చేబట్టినమహా

కవి శ్రీనాథుఁడు. సంస్కృతభాషా మహాకవులు భాస కాళిదాస భవభూతి బాణభట్ట మయూర శ్రీహర్షాదులు మనకవిసార్వభౌమునకు నయనాంతజ్యోతులు. "పూర్వకవిముఖ్యవిరచితాపూర్వ కావ్యభావరససుధాచర్వణప్రౌఢత" కలవాఁడని దుగ్గన్నచే ఉగ్గడింపఁబడినాఁడు.

శ్రీనాథుఁడు తానధ్యయనించిన వివిధశాస్త్రములు విప్రతిపత్తిధీవిషయములని తెలిసికొని వానిసమన్వయసారము గ్రహించిన మహాప్రతిభాయోగి. పరమశివునియందు పర్యవసాయిగాఁ దనవ్యుత్పత్త్యతిశయమును పండించుకొన్నవాఁడు. కాశీఖండములో శివశర్మోపాఖ్యానము అన్నది యొకటియున్నది.

మధురాపట్టణములో శివశర్మ యను విప్రోత్తముఁడు శాస్త్రాధ్యేతయొకఁ డుండెను. ఆతఁ డనంతద్రవ్యము నార్జించెను. సంతానవంతుఁడు. భోగము లనుభవించినాఁడు. కొంతకాలమున కతఁడు యౌవనముపోకకు, ముదిమి రాకకు శోకించి వ్యాకులుఁ డయ్యెను. శాస్త్రాధ్యయనముకాని, ద్రవ్యార్జనముకాని, పుత్రసంపదకాని, పౌనఃపున్యసుఖానుభవముకాని ఆతనికి శాంతి నీయలేదు. తీర్థయాత్రలకుఁ దలపెట్టెను. కాశీ ప్రయాగము మరల కాశీ, ప్రయాగము ఉజ్జయిని అయోధ్య ఇట్లు యాతాయాతములు జరుగుచుండెను. అమృతక్షేత్రమైన ఆనందకాననమందు శివశర్మకు ప్రామాణ్యము కుదురలేదఁట. దానికి హేతువు పుణ్య ప్రమాణాంతరముయొక్క అనువృత్తి.

"గృహమేధి ప్రవరుండు విప్రుఁ డమృతక్షేత్రంబు వారాణసిన్
ద్రుహిణక్షేత్రముఁ బాసి పోవఁదలఁచెన్ దూరంబుగా వెండియున్
మహిఁ గైవల్యదతీర్థముల్ కలిమి సంభావించి శాస్త్రజ్ఞతన్
బహుధా విప్రతిపత్తిధీవిషయముల్ పాడైనశాస్త్రార్థముల్."

తాను బహుశాస్త్రములు అధ్యయనించియు ఒకదానియందును ప్రామాణ్యబుద్ధి లేకున్నవాఁడు శివశర్మ. "ఈచదువులు చదువులు కావు

దేనిని ఎఱుఁగుటవలన అన్నింటియొఱుక నీకు కలుగునో అద్దానిని తెలిసి కొనుము'' అని యీకథ చెప్పినట్లయినది. కవిసార్వభౌముని యుప దేశ ఫణితి అనన్యాదృశము.

ఆంధ్రకవిత్వముయొక్క సర్వభూమియందు శ్రీనాథుని యాధి పత్యము స్పష్టముగా నున్నది. పండితులు ఆయనపేరు చెప్పగానే కొన్ని ప్రయోగములు చేయుదురు. ''గమికర్మీకృతనైకనీవృతుఁడనై'' సరేసరి.

''అదవీయసి మోక్షపదవి యధికవివేకా!''
''వేదపురాణశాస్త్ర పదవీ నదవీయసి''
''శయనోత్థాయము భోజరాజతనయా సంఫుల్లనేత్రాబ్జముల్''

''మృత్స్నాస్వాదనప్రక్రియావ్యాసంగంబునఁ గమ్మనైన యదసీ యంబైన బింబోష్ఠమున్.''

''సౌఖశాయనికులై సనకాదియోగీంద్రు లనురాగవీక్షణం బభిలషింప''

ఈమున్నగునవి తెనుఁగుకవిత్వముతో సంబంధము బెట్టుకొనని సంస్కృతవిద్వాంసుల నోటఁగూడ వినఁగలుగుచుందుము. శ్రీనాథుని గీర్వాణవాణికి ఒక ప్రత్యేకమైన పలుకుబడి యున్నది. ఆయన కావ్య సాహిత్యసౌష్ఠవమునకుఁ గారణము ఉద్బోధకము నైన వస్తుసామగ్రి లోకాతిశాయిసుందరమైనది. మృత్యుంజయమైనది.

ప్రాఁతపై చీర చెఱఁగున బడుగువాఁడు
హేమశైలంబు చిదిమి ఈ రెన్నిముడుచు''!

—♦♦♦—

# తెలుఁగు వ్యాసము తద్వికాసము

తెలుఁగులో సారస్వతాంగముగా భాసిల్లుచున్న వ్యాసప్రక్రియ యొక్క లింగోద్భవ కాలమును గూర్చిన చర్చలు, సిద్ధాంతములు సిద్ధసాధనములు. మన భావనలో ఆంధ్రవ్యాస మహాపురుషున కిపుడు నూఱేండ్ల పండువు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి విభవోత్తరమైన యీ యనుసంధానమున దయచేసి నాకును పాలుచేసిన వారి వత్సలత్వమునకు ముందు వందనములు.

వ్యాస మనగా నేమి? దాని మూలద్రవ్యము ప్రాచ్యమా? పాశ్చాత్యమా? ఇది మన తెలుఁగులో అచ్చముగా నెపుడు చొచ్చు కొన్నది! దీనికి పురుడుపోసినది ఎవరు? ఈబిడ్డ యెవరి పొత్తిళ్ళలో ఒడలు చేసినది! ఎప్పుడు తప్పటడుగులు వేసినది? దీని చదువు చదురు లెవరివలన? మున్నగు ప్రశ్నములకు సమాధానపఱచునది ప్రథమ ప్రసంగము.

నా వంతు ప్రసంగసమయమునకు తెలుగు వ్యాసము వయస్సు పాతిక యేండ్లపై చిలుకు. ఇరువదవ శతాబ్ది వచ్చినది. నలువది యేడేండ్ల పరతంత్రమైన భారతకాలమానములోని తెలుగు వ్యాసము వికాసమునుగూర్చి మనవిచేయవలసినవాఁడను. ఇది యొక విధముగా సాధారణేతరమైన విషయము. ఒకటి కాదు; పది కాదు; వందలుగా వేలుగా ఈ నలువది యేడేండ్లలో వ్యాసముల ప్రాదుర్భావము పెద్దలకు తెలిసినదే. "పత్రికలు లేనిచో వ్యాసములు లేవు" అన్నది సాహస మైన మాట కావచ్చుగాని, ఈ ఉభయమునకు ఉపజీవ్యోపజీవక సంబంధము గెంటరానిది; ఆనాఁడు మఱియును.

లోఁతునకు చూచినచో వ్యాసకళది ఇచ్ఛాజననమే కావచ్చును. వ్యవహారతః, వ్యాస ప్రక్రియా ప్రభవ కారణమైన పందొమ్మిదవ

శతాబ్దిలోని కడపటి పాతిక ఆకళకు స్నాతకదశ. మఱి, ఈ యిర్వదవ శతకములోని తొలిరెండు చరణముల కాలము దాని కళ్యాణ ఖేలన కాలము. వ్యాసము భావధ్వని వ్యంగ్యసేవధియైన కావ్యముగా చివురొత్తిన కాలము. పదవివేకము వాక్యవిధులు కాకు ప్రకారములు ఆకళించుకొని వైపువాటము లెఱిఁగి తీరుఁదీయములు తెలిసి జాజి తీఁగలుగా, మల్లెపందిళ్ళుగా సహృదయులచేతోవీథులలో అల్లుకొన్న వ్యాసములకు ప్రసవకాలమది. ఎందఱు వ్యాసకర్తలు! ఎన్నెన్ని రచనలు!!

"అహో జానామి తస్మిన్నేవ ప్రదేశే తస్మిన్నేవకాలే వర్తే"

చరిత్రము, పరిశోధనము, విమర్శనము, విద్య, దర్శనములు, మతము, సమాజము, రాజకీయము, ఆధునిక విజ్ఞానాది శాస్త్రములు, గ్రాంథిక వ్యావహారిక భాషలు, సాహిత్యమునందలి క్రొత్తపోకడలు... మఱి యెన్నో నైకవిధాంశములపై వ్యాసవిహారము జరిగిన కాలమది. నాఁటి వ్యాస సముచ్చయ మొకపరిధిలో భాగశః భావించుకొని, సమానతః దాని వికాసమును మనవిచేయుటకు యత్నించుచున్నాను. వ్యాసముల తత్కర్తల నామధేయములు కొన్ని సద్యస్స్ఫురణము చాలమి దాటిపోవచ్చును. పౌర్వాపర్యమున విపర్యయము రావచ్చును సహానుభూతి గల సహృదయులు మన్నింతురని ధైర్యము. ఈ నలువది యేడేండ్ల కాలములోని వ్యాసాభ్యుదయమును "పంచదశి"గా పరికించుకొంటిని.

## మొదటి పది ( 1900 - '10 )

ఈ శతాబ్ది మొదటి దశకములోకొన్ని పత్రికలు వ్యాసరచనోద్బోధకములు వచ్చినవి. కందుకూరివారు, శ్రీపాదవారు, చిలకమర్తివారు, కొక్కొండవారు, సంపాదకత్వము తో దిగిన పెద్దలు స్మరణీయులు సాంఖ్యాయన శర్మగారి కల్పలత, మఱియు మంజువాణి, సరస్వతి,

రత్నాకరము, శశిరేఖ, మున్నగు కొన్ని పత్రికలు తెలుగువ్యాసము నకు ప్రకాశనము నిచ్చినవి. నెల్లూరునుండి పూండ్ల రామకృష్ణయ్య గారి "అముద్రితగ్రంథ చింతామణి" వెలువడినది. భాషావాఙ్మయ విమర్శన వ్యాసములకు చింతామణి చింతామణియే.

క్రిందటి శతాబ్ది కొట్టకొసలో పుట్టి యీశతాబ్ది కనువర్తమాన ములగుటకు యత్నించిన పత్రికలలో నెల్లూరునుండి వచ్చినపత్రిక "వర్తమానతరంగిణి" యొకటి. బెజవాడ బాలకృష్ణారెడ్డిగారు, పట్టాభిరామరెడ్డిగారు వర్తమాన తరంగిణికి ప్రకటన కర్తలు, వ్యవహర్తలునై ఉండెడివారు. పట్టాభిరామిరెడ్డిగారు "వార్తాపత్రికాలక్షణ ప్రశంస" అను శీర్షికతో లఘువ్యాసము వ్రాసి వర్తమాన తరంగిణిలో ప్రకటించిరి. చెప్పవచ్చిన దేమనఁగా, కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు సంక్షేప రూపమున పత్రికాలక్షణములు చెప్పుచు వ్రాసిన అయిదు సీసములు వారు ఆలఘువ్యాసములో ఉదాహరించిరి.

"పత్రముద్రా సౌష్ఠవంబు, సద్భాషయు, ధర్మనీతి న్యాయ తత్త్వదమగు వ్యాసము..."

అన్నది ఆసీసములో ఏకదేశము. వ్యాసముయొక్క లక్షణము ఒకటి. ఇట్టి వ్యాసము పత్రికాలక్షణములలో నొకటియని చెప్పుట అపూర్వాంశము కాకపోవచ్చును. కాని, నేఁటి కెనుబదియేండ్లనాఁటి వర్తమాన తరంగిణిలోని యీ వృత్తాంతము జిజ్ఞాసువులకు హర్షప్రద మైనది. ఆనాఁటివ్యాసములు విషయచాలనమున, నిశిత పరిశీలనమున మొగ్గదొడిగినవి. ఆర్థికమైన సొగసులకంటె శాబ్దికమైన చర్చలకు అధికావకాశ మొసఁగిన వ్యాసములే హెచ్చనవచ్చును. ఆంధ్రభాషా మధుమధనులైన వేదం వేంకటరాయశాస్త్రిగారు, వేంకటరత్నం పంతులుగారు వ్రాసికొన్న వ్యాసములు ముదురు పాకమునఁబడుచున్న టులు తోఁచినను పండిత పాఠకులకు దాని ప్రయోజన మనల్పము.

పూండ్ల రామకృష్ణయ్యగారి ఆంధ్రమహాభారత విమర్శనము, మొల్ల రామాయణము అను వ్యాసములు ఆనాఁటి యుద్భవములు. పందొమ్మిదవ శతాబ్ది తుది పాతికలోఁ జివర గ్రంథవిమర్శన రూపరచనలే విరివిగా నుండి, తాదృశములే తరువాత అనుస్యూతములగుచు వచ్చినవి. పాఠ భేదములు, తదర్థ నిర్ణయములు, అఖండయతులు, అర్ధ బిందువులు, క్త్వార్థకేకార సంధులు, దధప్రాసములు, సశప్రాసములు, కళాద్రుత ప్రకృతికములు, పరిఖాపరిఘ శబ్దములు ఇత్యాది చర్చలు భాషా ప్రయోగవైదుష్యము సంపాదింపఁగోరువారికి మహాప్రసాదములుకదా! సంస్కృతభాషావిచక్షణులై ఛందోవ్యాకరణాదులు సుష్ఠుగా అధ్యయనించి, తెనుగులో అధిగతపరిశ్రములై, ఆంగ్లసారస్వతవైఖరులు అవలోకనము చేసికొనుచున్న విద్వాంసుల చేతిలో ఆనాఁటి వ్యాసము "పురంధ్రి"వలె పాఠకచిత్తమునకు భక్తిజనకమై శోభిల్లినది. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారి మనుమను ప్రకాశికను మంజువాణి ప్రకటింపఁగా "సరస్వతి" ఆయన వ్యాసమే "ఆంధ్ర కవితాపిత" నావిష్కరించెను.

స్వామి వివేకానందోపన్యాసములు, అనిబిసెంటు ఉపన్యాసములు వి. మూర్తిరాజుగారి అనువాద వ్యాసములుగా "సరస్వతి" ప్రచురించెను. ఉపన్యాసముల వ్యాసరూపావతారము పురాణమైనదే. గాలికి విడిచినచో ఉపన్యాసము; వ్రాతకు వచ్చినచో వ్యాసము. ఉపన్యాసము అనగా ప్రాయశః ఆనాఁడు ప్రసంగవ్యాసమే. ఆశువుకాక మాటాడఁ దలఁచినదెల్ల కాగితముమీఁద వ్రాసి చదువుట పడమటివారి ఆచారమని ఎఱుఁగుదుము. వెనుక వెనుక నిది ప్రాచ్యాచారమనియు వ్యాసము విశదము చేయుచున్నది. సారస్వతములేకాక, బహువిషయకములగు వ్యాసములకును ప్రథమ దశకము చోటిచ్చినది...

అల్యూమినియమ్, తులసిచెట్టు, అగ్నిపర్వతములయందు గల సుగుణములు, చేతిపనుల అభివృద్ధి నేలబొగ్గు మున్నగు శీర్షికలతో వ్యాసములో, ఆభాసములో అనందగినవి రాకపోలేదు.

వీరేశలింగంగారి భౌతిక భూగోళశాస్త్రము
చిలుకూరి వీరభద్రరావుగారి స్వయంసహాయము
అత్తిలి సూర్యనారాయణగారి హిందూదేశదారిద్ర్యము(మనోరమ)
హిందువుల ప్రాచీన లోహాపరిశ్రమము, హైందవచిత్ర
కళానైపుణ్యము.

ఆయుర్వేదాంగ శల్యతంత్రము, "శాసననిర్మాణ సభా సభ్యులు-వారి ధర్మములు" ఇంగ్లీషువారి సంసార పద్ధతులు... ఈ విధముగా త్రవ్వితండములుగా వస్తుప్రధానములగు వ్యాసరచనలు నాంటివి చూడంగలము

విషయము చప్పనిదైనను, చెప్పాటలో వక్రత, చమత్కారము గల రచనాపద్ధతికి నాంటి వ్యాసమున తక్కువతనములేదు. "కల్పలత" గొడుగులపై ఒక లఘువ్యాసము ప్రకటించినది.

"......సౌకుమార్యముగల కాంతలు చేతులతో ఛత్రదండములు పట్టుకొనుటవలనం జేతులు కందిపోవును గనుక కఱ్ఱలేని గొడుగును గల్పించి దానికి రెండుప్రక్కల రెండు చులకని ఇనుపబెత్తముల నమర్చి చంకలక్రిందనుండి భుజములకు బిగించి వీపునకు కట్టుకొనవలసిన రెండు తోలుపెట్టెల నేర్పరచెను. ఈ గొడుగులు వేసికొను దొరసానులు తమ చేతులతో నింకేమైన పనిచేసికొనుచు నడవవచ్చునని యాతం డనుకొనుచున్నాడు. కాని నడుచునప్పు డొక పెద్దగాలి విసరెనేని వారిగతి యేమగునో యా బుద్ధిశాలికి పొడగట్టలేదు".

ఇంగ్లీషువాని వస్తువులతయారీపై, దొరసానుల సౌకుమార్యముపై ఈ లఘువ్యాసము మెత్తమెత్తని యుత్ప్రాసము చేసినది.

## రెండవ పది ( 1910 - '20 )

ఏమైనను, వ్యాసరచనాశాఖలో భావికళలందు కాఁదగిన క్రొత్తయొడుపులకు ఎత్తుగడలకు ఒయ్యారములకు, తియ్యదనములకు, భావప్రౌఢిమలకు మొదటి పదియేండ్లు ముకుళనదశయే. వికసనారంభము తరువాత తరువాత విస్పష్టపడుచున్నది. అది శైలీ శిల్పసంబంధి మఱియు రెండవదశకములో గడుసుఁదనము నేర్చుకొన్నది. వక్రోక్తులు వ్యంగ్యములు దాని యడుగుజాడలు. వాక్యము దీర్ఘమైనను పాఠకునకు విశదపరచుటలో ఇబ్బందిలేని విధానము కావచ్చునుగానీ, వీరేశలింగ ప్రభృతుల వాక్యము ప్రాయశః పొడవైనది. అది కొంత మాఱినది. వాక్యములలో దైర్ఘ్యము సన్నగిల్లుచున్నది. వామన వాక్యముల యెడ ప్రేమ పెరిగినది. క్రియాపదబహుళమైన రచన. సూటియై అక్లిష్టమైన పదప్రయోగసరణి. వ్యాసము నెత్తుగడలో ఆకస్మికత. దింపుటలో వంపులు. ప్రశ్నముతో ముగింపు. ఇట్టిజాతి నూతన వ్యాసరచనకు రెండవదశ వైజననకాలము.

"పాండిత్యము-అలంకారములు-సాదృశ్యము" అనునది కట్టమంచి రామలింగారెడ్డిగారి వ్యాసము. "త్రిలింగ" ప్రకటితము. ఆకృతిచే వామనము; ఆలోచనముచే త్రివిక్రమము.

"రేయింబవలును వ్యాకరణములను నిఘంటువులను ప్రాచీన కావ్యములను వర్ణించుచుండుటచేత కవితకుఁ బుష్టిలేదు. తన మనస్సున నెన్నియో భావములు ప్రభవిల్లకున్న నితరుల మనస్సులలో భావము లుప్పతిల్లఁజేయుట యెట్లు? కట్టె వారిన కోవిదులకన్న లోకవాసనల ననుభవించి యానందించువారే మేలు......"

ఈ రకమైన ఉపక్రమణము సంప్రదాయముపై వ్యాసకర్త తిరుగుపాటుచేయుచున్నాడన్న భ్రాంతి కలిగించును. "నన్ను చదివి చూడుము. నీపని తరువాత చూచుకోవచ్చునులే" - అని పాఠకు

నెచ్చరించు లక్షణ మీ యెత్తుగడలోనున్నది. విషయ గాంభీర్యము ఆవిష్కరణధైర్యముగల ఆ నడిమిపట్టు పునఃపునః చదివి అనుసంధానము చేసికోవలసినదే కాని అలవోకగా చూచివైచుటకు వీలు కలుగదు. వ్యాసములోని భాష సలక్షణము. వాక్యము శక్తిమంతము. వ్యాసముయొక్క సమాప్తి యిటులున్నది,

"ప్రతిపదార్థమునకు నొక యుపమాన ముండితీరవలయునన్న, కట్టకడపటి యుపమానమున కాధార మేమి ? కావున నెట్లును నేదో యొక వస్తువు తనంత తనకనుగుణమైన భావమునుబట్టి చేయునుగదా? అట్లగుట మొదటి వస్తువునకే ఆగౌరవము నేల ప్రతిష్ఠింపరాదు ?

స ప్రశ్న సమాప్తి. హఠాదుపక్రమణము వ్యాసమున కొక క్రొత్తదనము నిచ్చుచున్నవి. నాఁటి ఖండకావ్యరచనలోని నవ్యలావణ్యరీతులు వ్యాసప్రక్రియయందును ప్రవేశించినవనుట కవకాశమున్నది. మఱియొక విశేషము. శీర్షికలు పెట్టుటలో నొక క్రొత్తదనము ఆ రెండవ దశకములో గోచరించును.

భాష-భావము-సంగీతము...కోపల్లె హనుమంతరావు
అభిధ-లక్షణ - వ్యంజన...బంకుపల్లి మల్లయ్యశాస్త్రి
గ్రామ్యభాష కాదు - వ్యావహారికభాష-గిడుగు రామమూర్తిపంతులు

భారత భాషకును నేటి గ్రాంథికభాషకును భేదము...మండపాక వారు. ఇటులు తాను వ్యాసములో చెప్పఁదలచినది స్పష్టముగా సూచించు శీర్షిక యుంచుట, సమస్తపదము గాక - వ్యస్తపదములలో నుంచుట నాఁటి యాచరణమునఁ దోఁచునది.

"భాష-భావము-సంగీతము"అను నీ తలకట్టు ఏమి తోఁపఁజేయుచున్నది? ఈ మూఁటికి చుట్టరికము ఉన్నదనియా? లేదనియా? పాఠకునకు విచికిత్స కల్పించుటయే ఈశీర్షిక ఉద్దేశ్యము 'భాషాభావసంగీతముల

యితరేతర సంబంధము'' అను శీర్షిక చూచి వేత్తయైనవాఁడు ఆ వ్యాస మిక చదువకపోవచ్చును. కనుక, శీర్షిక ప్రధాన కథనీయమును వెల్ల డించ రాదన్నది తద్వ్యాసకర్త యాశయము. కావ్యార్థముయొక్క మనాకూచన మెట్లు నాందిలో జరుగునో అట్టిపని వ్యాస నామధేయ మచట చేయుచున్నది. ఇట్టి శీర్షికలు సకృత్తు. వ్యాసమునకు ఉపరితల మున నిలిపిన పేరు కర్తృహృదయమును శృంగగ్రాహికయా చూపఁ గలిగియుండవలయునన్నది తఱచుగా నప్పటివారి తలంపు.

ఈ రెండవ దశాబ్దిలో వెలువడిన ప్రముఖవ్యాసాలు కొన్నిని గుఱుతు పెట్టుకోవలసినవి.

మాడపాటి హనుమంతరావుగారి ''మహాభారత సమీక్ష''
మానపల్లి రామకృష్ణకవిగారి ''తెనాలికవులు''
తిరుపతి వేంకటకవుల ''శ్రవణానంద శృంఖలాతృణీకరణము''
అక్కిరాజు ఉమాకాంతముగారి ''దేశభాషాస్థానము''
వఝ్ఝలవారి ''ఆంధ్రభాష''
చిలుకూరి వీరభద్రరావుగారి సారస్వతజీవనము (1916)
వీరేశలింగంగారి ''బమ్మెరపోతరాజు'' (1919) ఇత్యాదులు

నాగేశ్వరరావు పంతులుగారి ''ఆంధ్రపత్రిక'' ఉగాదిసంచిక 1910లో సాధారణారంభమే అనిపించినను వ్యాస వాఙ్మయోజ్జీవనము నకు ఆ సంచికల మహితప్రయోజనము ఆయతిలో అసాధారణమై వెల సినది; వెలయుచున్నది. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక 1912 మొదలు భాషాసారస్వత శాసన పరిశోధనాది బహుముఖ వ్యాసములు వెలువ రించుటలో దీక్షాపరురాలు. కృష్ణా పత్రిక, త్రిలింగ, ఆంధ్రభారతి వీనిని మఱచిపోవుట యెట్లు ?

రెండవదశలో, తెలుఁగు దేశము నెడల తెలుగుభాష యెడల, తెలుఁగుఁ దనము నెడల తత్పూర్వముకంటె అభినివేశానురాగము

లతిశయితములగుచున్న వనుటకు వ్యాసము వేనోళ్ళ సాక్ష్యము పలుకు చున్నది. ఉమాకాంతముగారి దేశభాషాస్థానము అను వ్యాసముచేసిన యుద్ఘోషము చిత్తగించునది.

"రాజకీయ వ్యవహారములు తెలిసికొనుటకు ప్రభువుల భాషను నేర్చుకొనుటకు మనకు మహమ్మదీయుల కాలమునుండి అలవాటైన పనిగనే యున్నది. కాని జీవితమంత మేధావంతులు పరదేశభాషలోఁ గడుపుట దేశమునకు శ్రేయస్కరము కాదు. జీవితమంత పరభాష యందే గడపిన కొందఱు మహానుభావులకు దేశభాష యన్నఁ దృణ ప్రాయముగ నున్నది. దానిపై ద్వేషముకూడఁ గొందఱకుఁ గలుగు చున్నది. చెన్నపురి పచ్చయప్ప కళాశాలలోఁ బ్రకృతిశాస్త్ర పండితులుగనుండి గొప్ప పేరుపొందిన లక్ష్మీనరసు నాయుడుగారివంటి శాస్త్రవేత్తల పరిజ్ఞానము మాతృదేశమున కజాగళస్తనముగా నున్నది కదా యని చింత కలుగుచున్నది. జనులకు పరభాషయందు శాస్త్ర జ్ఞానము వర్ధిల్ల నేరదు. అది ఫలవంతము కాదు. ఉద్గ్రంథములు శాస్త్రములు తెలుఁగులో రచింపవలసియున్నది..."

ఇది యిటుండఁగా, కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారి తెలుఁగు నుండి త్రిలింగము పుట్టెనన్న వ్యాసము త్రిలింగమునుండి తెలుఁగు పుట్టెనన్న కాశీభట్టవారి ప్రతివ్యాసములు ఆనాఁడువచ్చినవి. వానిలో విసరులు, ఆక్షేపణములు పాకముతప్పక మర్యాదమీఱక మృదువుగా సాగినవి. అప్పుడే తెలుఁగులోని పరశీలనాత్మకవ్యాసము కొంత దురావేశము తగ్గించుకొని శాంతపడుచున్న దన్నమాట.

లక్ష్మణరావుగారన్నారుకదా!

"క్రొత్తవిషయమును చెప్పినవానిని పండితులు కొందఱు నిందించుట సహజము కావున నన్ను కొందఱు ప్రస్తుతవిషయమును గురించి

దూషింతురని నేనెఱుంగుదును. కాని వారి దూషణ భూషణములతో నాకు ప్రయోజనములేదు. సత్యాన్వేషణమే నా పని. కావున నెవ్వరైన నీ విషయమును ఖండింపఁదలఁచిరేని సప్రమాణముగా వ్రాయఁ బ్రార్థితులు. నన్నయభట్టు తిక్కన సోమయాజులచే రచింపబడిన గ్రంథములలోఁగాని పదునాల్గవ శతాబ్దమునకుఁ బూర్వము రచింపఁబడిన మఱి యే గ్రంథమునందుగాని "త్రిలింగ" శబ్దప్రయోగము నెవ్వరైన చూపిన యెడల నా యభిప్రాయము మార్చుకొన సిద్ధముగా నున్నాను."

దీనికి కాశీభట్టవారి సోపపత్తికమైన ప్రత్యుత్తర వ్యాసము సైతము పక్షాభిమానమునుగాక సత్యాభిమానమునే ప్రకటించుచున్నది.

"త్రిలింగశబ్దము క్రీస్తుశకము రెండవ శతాబ్దమునందుండిన టాలెమీ యను ఖండాంతరుఁడీ దేశముంగూర్చి ముచ్చటించుచు త్రిలింగమనియే వాడియున్నాడు. శ్రీయుత లక్ష్మణరావుగారి వాదము నిలువనేరదు. త్రిలింగమునుండి తెలుఁగు పుట్టినదికాని తెలుఁగునుండి త్రిలింగము పుట్టలేదు."

ఈ యుద్ధరణములు నాఁటివిమర్శన వ్యాసము "త్వంశుంఠేత్యాది" ధోరణికి దూరమై ఎదుటివానికి మర్యాదనిచ్చి పుచ్చుకొను తరహా సంపాదించుకొన్నదనుటకు; మఱియు, మాతృదేశ భాషాభిమానము వ్యాసకర్తలలో నిటులు పుటపుట నగుచున్నదనుటకును.

1913 లో ఆంధ్రభారతి శృంఖలాతృణీకరణము అను తిరుపతి వేంకటకవుల వ్యాసము వెలువరించెను. అదికాని, "పాణిగృహీతా శ్రవణానందశృంఖల" తత్పూర్వ వ్యాసము శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారిది కాని చాలపాలు శబ్దసాధుత్వాసాధుత్వముల చర్చలతోఁ గూడినదేయైనను, అక్కడక్కడ వెక్కిరింపులు ఎత్తిపొడుపులు లేవనలేము. పిఠాపురమునుండి వచ్చిన వేంకటరామకృష్ణకవుల "కవిత"

పత్త్రిక శతఘ్ని, పరాస్త్రపాశుపతము, అట్టహాసము మున్నగు వ్యాసములు ప్రకటించెను. అవి తిరుపతి వేంకటకవుల దేవీభాగవతము, ఉద్యోగవిజయాదులపై విమర్శన రూపము లైనవి. పాశుపతము, తాలుకట్టనము ప్రతి విమర్శన వ్యాసములు తిరుపతి వేంకటకవులవి. ఒక్కొక్క వ్యాసము ఒక్కొక పొత్త మయినది. ఆ జంటకవులదంట వాద ప్రతివాద వ్యాసముల పరంపరచే భాషాప్రయోగరహస్యములు పెక్కు చమత్కృతిమద్భావములో వెల్లడించినవారు.

౧. ఈదాకలో అరసున్న వేయుఁడు.

౨. సురిగిన శూరులా ? అరసున్న సురిఁగినది.

3. నాదా దౌర్భాగ్యముగాక నీకు రిపులన్నా ! గడ్డిపోచల్ గదా! అరసున్నలేమి గడ్డిపోఁచలే.

౪. అన్నప్రతిజ్ఞ త్రిప్పుటకునై చనియే బ్రతిమాలుకొందు - గ్రేవాంగు లన్నట్లున్నది. బతిమాలు సాధువు

౫. ఏనెక్కడ యాతఁడెక్కడ యిసీ ! - ఏమి సంధివివేకము ! ఇది ప్రైమరీ పరీక్షలోఁ గృతార్థుడు కానివానికిని తెలియునదే - ఏనేడ ? నిండ్రాదు లేడ ? భారతము

అఱసున్నలు – బండిఱాలు - యతిభ్రంశములు, ద్రుతప్రకృతికములు వీనినిగూర్చి తంటాలుపడుచున్న వ్యాసము లొకవంక పుంఖానుపుంఖముగా వచ్చుచుండఁగా వేఱొకవంక ఆ రెండవ దశకములోనే వ్యావహారిక వాదప్రోద్బలకములగు వ్యాసములును వచ్చినవి.

1914 లో రెంటాల వేంకటసుబ్బారావుగారి "హెచ్చరిక" వచ్చినది. ఆకాశవాణి తన బిడ్డలతో మొఱపెట్టుకొనుచున్నటులు ఆ వ్యాసము వ్రాయఁబడినది. ఆంధ్రభారతి ఆత్మని వేదనముచేయు నీపద్ధతి నాఁటి వ్యాసవైలక్షణ్యములలో ఒకటి. ఆమె చేసిన హెచ్చరిక యిది :

"నాదొడ్డబిడ్డలారా! నా మొర కొంచెం చెవిని పెట్టండి గ్రాంథిక భాషయొక్క తత్త్వము తెలియక దానిలోని పిచ్చిమార్పులు కూర్పులు తెచ్చిపెట్టి పరిశుద్ధముగానున్న నాదివ్యసాధనమును పాడుచెయ్యకండి. అగ్రగణ్యులైన మహాకవులు అప్పుడప్పుడు కల్పించే కూర్చే కొత్త అందాలతో తృప్తిచెంది మీబుద్ధిఅంతా వాడుకభాషను ప్రసిద్ధిలోకి తెచ్చి పరిశుద్ధపరచి వృద్ధిపరుచుటయందు వుపయోగించండి. వాడుక భాష అందరికీ కావలసినభాష. అందరు జనులు సామాన్య సంభాషణ యందు వుత్తరప్రత్యుత్తరాలయందు లోకవ్యవహారాలయందు ప్రతిదినం ప్రతినిమిషం ఉపయోగిస్తూవున్న భాష. వాడుకభాషను కాకితంమీద నిందించేవారుకూడా యింట ఆలుబిడ్డలతో మాట్లాడేది వాడుకభాషే. మరెందుకు వాడుకభాష అంటే నిందింపవలెను? ఏల సిగ్గుపడవలెను? సామాన్యజనులు పామరులు. నాబిడ్డలలో 199 లక్షలు వీరే. వీరి నిమిత్తము కల్పింపబడే గ్రంథాలు వాడుకభాషలోనే వుండవలెను."

ఈ యుద్ధార మెందుల కనఁగా "వ్యాసము" వాడుకభాషకును సదవకాశ మిచ్చినకాలమది యనుటకు. రెండవదశలోనే కాశీకృష్ణా చార్యులుగారి ఆంధ్రభాషాసంస్కరణము (1912) వంటి వ్యాసములు అర్ధానుస్వార శకటరేఫ సంధి పరిత్యాగమువలన భాషకుఁ గలుగు నష్టములు ఘోషించుచునే వచ్చినవి.

"విధి నిషేధములులేని గ్రామ్యపదభూయిష్ఠముగా వాడుకొను భాష యాయాకాలములంబట్టియు, నాయా రాజులంబట్టియు, ఆయామానిసులంబట్టియు, నా యా దేశములంబట్టియు క్షణక్షణే మార్పునొందుచుఁ గులటవలె స్థైర్యములేక యుండును గాన మన మాతృభాషను పై రెండు స్థితులలో నే స్థితికిం దెచ్చుట యుచితమో యాలోచింపుఁడు."

అని ఆచార్యులవా రనుచుండఁగా, గిడుగు రామమూర్తి పంతులుగారు "గ్రామ్యభాష కాదు వ్యావహారికభాష" (త్రిలింగ 1914) అని జలదస్వన గంభీరమైన యెలుఁగుతో చేసిన వ్యాసగర్జనము విన్నవారున్నారు దాని ప్రతిస్వానము:

"ఈకాలములో నాగరకతకల దేశములన్నిటిలోను సర్వ సామాన్యముగా నాగరికుల వ్యావహారికభాషను ప్రజలకునేర్పి ఆభాష లోనే తెలివితేటలు పుట్టించే పుస్తకములు వ్రాసి చదివిస్తున్నారు. వేదములూ స్మృతులూ పురాణములూ కావ్యములూ అందరూ చదువు తున్నారా? అందరూచదవగలరా? చదివినా అర్థంఅందరికీ తెలుస్తుందా? వాటి అర్థం తమకు వచ్చిన భాషలో చెపితే ఎవరికైనా తెలుస్తుంది గదా! ఇంగ్లీషులో ఈగ్రంథములు చాలామట్టుకు వ్రాసి ఉండడంచేత నెరవేరడము సులభమవుతున్నదికదా! అలాగుననే భారతాది పురాణ గ్రంథముల పాతతెనుగుగాని ప్రబంధముల చిక్కు తెలుగుగాని తెలి యనివారికి బోధపడేటట్లు చేయవలెనంటే నలుగురూ మాట్లాడుకునే భాషలో వ్రాసి చెప్పవలసి వుంటుంది."

రామమూర్తిపంతులుగారి వ్యవసాయఫలముగా వ్యాసక్షేత్ర మున వాడుకభాష కొంత చనవు ఏర్పడినది. యీరెండవ దశలోనే పూర్వకవుల చరిత్రాంశములు వారి అభిజనకాలాదికమును గూర్చి ద్వంద్వయుద్ధములు చాలించినదియు లేదు.

వీరేశలింగముగారి "బమ్మెరపోతరాజు" వ్యాసము 1949 లో వచ్చినది. బహుశః అయన కడపటి వ్యాసము ఇదియకావచ్చునేమో! బమ్మెర పోతరాజు ఒంటిమెట్టవాఁడని కొందఱు, ఓరుగంటివాఁడని కొందఱు కొంతకాలము విజయార్థులై పోరాడిరి. మున్నే వీరేశలింగము గారు పోతన ఒంటిమెట్టవాడని తెలుఁగు భాగవత పీఠికలో వ్రాసి యుంచిరి. పదపడి వచ్చిన వాదానువాదములను బురస్కరించుకొని

ఆయన తొంటియభిప్రాయమును మార్చుకొని పోతన ఓరుగంటివాఁడే యని స్వీయనిర్ణయము ప్రకటించిరి. అది వావిలికొలను సుబ్బారావు గారికి ఒప్పమియైనది. ఆయన ఒంటిమెట్టవాదులు.

నన్నిచోడుని కాలమునుగూర్చి పెద్ద అడావుడి. పండితులు దండాగొండిపడినారు. మానవల్లివారి వాదము నన్నిచోడుడు నన్నయకు మున్నువాఁడని, నడకుదటి వీరరాజుగారు ఆ వాదమునకు అనువాదకులు. జయంతి రామయ్యపంతులుగారి "నన్నిచోడకవికాలము" అన్న వ్యాసము శాసనోదాహరణపురస్సరముగా పయివాదమును పరాస్తము చేసినది. దానితో, ఈ యుభయకవుల పీఁటలు తాఱుమాఱయినవి.

1914 లో మానవల్లివారి "తెనాలికవులు" వ్యాసము కొన్ని నూతనాంశములను బహిర్గతము చేసినది. "రామకృష్ణకవి కృష్ణరాయల సభలో నూత్నయౌవనము చెల్లించి తిరుమలరాయల రాజ్యకాలమునకు వృద్ధుడై ఘటికాచల మాహాత్మ్యకృతిలోఁ జేవడకుచుండును..." ఇత్యాదికము. జగమెఱిఁగిన తిరుపతివేంకటకవుల "శతావధానము" (1913) అన్న వ్యాసము నాఁడు క్రొత్తగావచ్చినది.

అవధానమనునది మొట్టమొదట వేదాధ్యయనపరుల కుండెడి నిరుపమానశక్తులలో నొక్కటియనియు దానిని కొన్నివందల సంవత్సరములనుండి కొందఱు మహాకవులు కవితాశక్తులలో నొకదానినిగాఁ గైకొని నేఁటి యిరువదవశతాబ్దము కొండొక జరుగువఱకు మంచి గౌరవము కాపాడుకొనుచు వచ్చిరనియు మనము భావింపవలసి వచ్చినది. అని చెప్పుచు నిట్టి యవధానములో మనమెఱిఁగినంతలో నగ్రగణ్యులు శ్రీమాడభూషివారేయని చెప్పక తప్పదని ఒప్పుకొన్న వ్యాసమిది.

ఒకయెడ సాహిత్యగంధిలములగు వ్యాసబంధము లిటు లుదయించుచుండ, మఱియొకయెడ స్వపరిపాలనము, ఆర్థికము, సమాజము

మున్నగు బహ్వాంశములపై భోగరాజు పట్టాభిసీతారామయ్య, మామిడిపూడి వేంకట రంగయ్య, మాడపాటి హనుమంతరావు, వల్లూరి సూర్యనారాయణరావు, గొల్లపూడి సీతారామశాస్త్రిగారలు వెలువరించిన వ్యాసములు తీగమెఱుపులుగా పత్రికాలోకమును భాసింప జేసినవి.

కృష్ణాపత్రికా జనకులు, అంతర్ముఖ భావుకులునగు ముట్నూరి వారు సంపాదకీయ వ్యాసములకు విశ్వసుందరమైన రూపకల్పనము చేసినారు. వారి ప్రత్యేక వ్యాసములును భాషాచిక్కణములై భావ గంభీరములై సమీక్షాదక్షములై వెలసి అధికారులగు పాఠకుల హృదయ పత్రములలో అచ్చుపడిన కాలమది.

కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు భగవద్గీతాది గ్రంథ ములకు వ్రాసిన పీఠికారూప వ్యాసములు, "ఆంధ్రవాఙ్మయ సూచిక" (1920) ఉపోద్ఘాతరూపమున వచ్చిన కావ్యలక్ష్యము - ఆదియుగము - మధ్యయుగము - శతకవాఙ్మయము అను నుపశీర్షికలతోడి రచనలు వ్యాసవాఙ్మయచిరంటికి సువర్ణకంఠాభరణములు, ఆంధ్రరాష్ట్రము ఢిల్లీ నగరము–ఢిల్లీ దర్బారు – అను నంశములను గూర్చియు వారి చారిత్రక రచనలు 1912 లో వెలువడినవి

ఈ రెండవ పదిలోనే గ్రుడ్డెద్దు చేనఁబడినటులు కాక, దేశకాల పాత్ర పరిశీలనము చేసికొన్న వ్యాసములనేకము లుద్భవించినవి. 1915 ప్రాంతమున చిలకమర్తివారి రజస్వలావివాహచట్టము, చివుకుల అప్పయ్యశాస్త్రి, శివపురపు వీరభద్ర పాకయాజిగారల రజస్వలా వివాహఖండనము, బొమ్మగంటి సీతారామశాస్త్రిగారి విగ్రహారాధన ఖండన ఖండనము – సమాజ సంస్కారపరములైన వ్యాసములు ఎడపెడగా ఎన్నో ఎడనెడ ఆనాఁడు రాకపోలేదు.

1917 లో "అనసూయ" ముద్దులొలుకు వ్యాసపునిసుంగులను ప్రసవించినది. శ్రీమతి పోణకా కనకమ్మగారి "వివేకానందస్వామి"

వానిలో నొకటి. "స్త్రీజనకల్పవల్లి"లోని (1918) అష్టవిధవివాహములు చక్కని వ్యాసము. నాఁడు స్త్రీసమాజ సముద్ధరణమునకు సంముఖీన మైన గృహలక్ష్మి, హిందూసుందరి మన తలంపునుండి తప్పించుకో నేరని పత్రికలు. మొసలికంటి రామాబాయమ్మగారి "మంత్రసానులు" అన్న వ్యాసము (ఆంధ్రపత్రిక : ఉగాదిసంచిక 1922) ఆమెరచనాశీల సంపదకు మేలిమచ్చు. హిందూదేశములో ప్రస్తుత మాంగ్లేయ వైద్యానుసారము పనిచేయు మంత్రసానులనుగూర్చి వ్రాయుచు రామాబాయమ్మగా రన్నారుకదా!

"బాధ్యతలేని బావగారిపై దూలముపడ్డా దుఃఖమురాదు" అన్నటులు కూలికి కొలువున్నవారికి అభిమాన మెటులువచ్చును? మన స్వకుటుంబములోని కాంతలు మంత్రసానులుగా పనిచేయుచున్న నెంత నెమ్మది, యెంతధైర్యమో మీరే యోచించుకొనుడు. తమ కుప యోగించు విద్యలు స్త్రీ లభ్యసింపకపోవుట దురదృష్టకరము. "పాండవుల జననియగు కుంతీదేవి వ్రతనియతిమై అంత్యజులగాలి సోకుటకూడ అపవిత్రమని మతగురువులచే నాదేశింపబడి స్నానార్థము కొలనికేగు నెడ, ఒక తరుమూలమున నిస్సహాయమై ప్రసవవేదననొందు· పంచమ జాతి స్త్రీని చూచి భూతదయచే వ్రతముమాట మఱచి వెంటనే మంత్రసాని కృత్యములు నెఱవేర్చి వెనుక స్నానమొనర్చి వ్రతవిఘాత మయ్యెనని వగచుచు నిల్లుచేర శ్రీకృష్ణులచటి కరుదెంచి "వ్రతఫలము కన్న వేయిరెట్లధికఫలము అకస్మాత్తుగా లభించగా వగవనేల యని యూరార్చెనఁట."

ఆనాఁటి తెలుఁగు రచయిత్రి సమాజసేవాదృష్టికి, భూతదయకు, హరిజనోద్ధరణకాంక్షకు ఈ వ్యాసము సోదాహరణోదాహరణము.

## మూఁడవ పది (1920 - 30)

ప్రాచీనాచారములు కొన్నింటికి ప్రత్యాహకాలము, నవీన సంప్రదాయములు పెక్కింటికి ప్రత్యాగమ కాలము. ఈశతాబ్ది మూఁడవ దశకములో వ్యాసరంగమున వినూత్నభావ విన్యాస విలాసములు.

1921 లో పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారివంటి లబ్ధ వర్ణుని లేఖినినుండి వచ్చిన "యక్షగానములు" అన్న వ్యాసము నాఁటి యువకుల, వాఙ్మయపరిశీలకుల మానసములను పల్లవింపఁ జేసినది.

సరస్వతీ పవిత్రాణాం జాతిస్తత్ర న దేహినాం ।
వ్యాసస్పర్థీ కులాలోభూద్ద్రోణో భారతే కవిః॥

"సరస్వతీ పవిత్రులగు దేహులకు, అనఁగా సరస్వతీదేవి యను గ్రహమునకుఁ బాత్రములైన మానవులకు జాతి యంత ప్రాముఖ్యము కాదు. ఎట్లనఁగా, భరతఖండమునందున్న ద్రోణుఁడను కవి జాతినిబట్టి కుమ్మరి యైనను సమస్తవేదవేదాంగములను సాకల్యముగా నధిగమించి వేదవ్యాసు డను బిరుదమునొంది భారతమను పేరితో పంచమవేద మును రచించిన వ్యాసమహర్షితో కవిత్వవిషయమున స్పర్థచేయువాఁ డయ్యెను."

అనురాజశేఖరుని సుభాషితార్థము నుదాహరించి తెలుఁగు దేశమునందలి వివేకఘనులైన ప్రాచీనజాతులవారిలో జక్కులజాతి వారి సంగీతసాహిత్యాది కళాకౌశలమునుగూర్చియు, యక్షగానముల ప్రాచీనత, నిర్మాణరీతి, తత్పరిణామమును గూర్చియు పంచాగ్నుల వారి యీ వ్యాసము ప్రథమావిష్కారమే చేసియుండవచ్చును.

చూడఁజూడఁగా, వ్యాసప్రపంచమున విజ్ఞానచంద్రిక వెల్లివిరి సినశరత్సమయ మదియ. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వసంపాదన ప్రథమశిల్పి కొమర్రాజు లక్ష్మణరావుగారు 1923లో విజ్ఞానచంద్రికలో విలీనులైన పిమ్మట "లక్ష్మణరాయ వ్యాసావళి" గ్రంథాకారమునకు వచ్చినది. ఆంధ్రదేశ చరిత్రరచనకు లక్ష్మణరావుగారికలము సిరియో చుక్కయో! ఏకశిలానగర మోరుగల్లే, చాళుక్యులు దాక్షిణాత్యులే, కృష్ణరాయల నిధనకాలము మున్నగు చారిత్రకములు - యుద్ధమల్లుని

బెజవాడ శాసనము ద్రావిడభాషలోని ఉత్తమపురుషవాచక సర్వ నామము మొదలగు భాషావిషయకములు - దేశభాషలో శాస్త్ర పఠనము, ప్రకృతిశాస్త్రము, రసాయనశాస్త్రములు, పంచాంగము, మేరుప్రదేశము, కర్మయోగము, లలితకళలు - ఇత్యాది శాస్త్రవిష యకములు నగు వ్యాసములు లక్ష్మణరాయ వచస్సుధానిష్యందములు.

తనువు రుజావృతంబయిన దార్ఢ్యము తప్పుచున్న భాషపై
కనికరముంచి తీవ్రకృషి కర్షకు రీతినొనర్చి తత్ఫలం
బనిశము నాంధ్రలోకమునకై వినియోగ మొనర్చియుంట నీ
జననము సార్థకంబయి ప్రసంగెను లక్ష్మణరాయ ధీమణీ!

శేషాద్రిరమణకవుల యీ చంపకము వారియశోవ్యాస వృత్త మునకు ఆరాత్రికము పట్టుచున్నది.

ఈ మూఁడవపది తొలినాళ్ళలో దువ్వూరి రామిరెడ్డిగారి "కవిత్వతత్త్వము" (1921) సాంఖ్యాయనశర్మగారి "ఆంధ్రకవితాకళ - తదితర మనోజ్ఞకళలు" (1924) గంధాలయ సర్వస్వము వెలువ రించినది.

విశ్వకవి ప్రతీతపురుషులు రవీంద్రనాథఠాకూరుగారి భావప్రభా వము వంగమునుండి ఆంధ్రరంగమునకు రమ్యాలోకము చేసినదప్పుడే. రాయప్రోలు సుబ్బారావుగారు మనోహరముగా వ్యాసపఱిచిన రవీంద్రనాథఠాకూరు (1917) కవితాసౌందర్యము భావుక మానసము లకు ఆసేచనకమైన దప్పుడే.

శ్రీవిరాజమానులు బెజవాడ గోపాలరెడ్డిగారు అటు జాతీయో ద్యమమున, ఇటు నవ్యసాహిత్య నిధ్యానమున సవ్యసాచియై ప్రవర్తిం చుట కల్యాణోదర్కమై రసజ్ఞుల కా నాఁడు పండువుచేసినది. శాంతినికేతనచ్ఛాయలలో గోపాలరెడ్డిగారి తెలుఁగువ్యాసములు రసిక

పిపాసకుఁ గొంత చనవు నొసంగినవి. శాంతగంభీరమైన భావలోచనము, సలక్షణము విలక్షణము నైన పలుకుబడి, సూటిగా సుందరముగా వాక్యము నెత్తుకొనుట, అభిజాత్యము మున్నగు రవీంద్రుని వ్యాసవాణీ గుణములకు ప్రతిపణముగా గోపాలరెడ్డిగారు సంతరించిన "రామాయణము" అను అనూదిత వ్యాసము ప్రథమోదాహరణము. ఆంగ్ల వంగభాషలు అచుంబిత ప్రక్రియలైన అచ్చమైన తెనుఁగు చదువరులకు ఇట్టి వ్యాసపుత్రికలు మాతృకాప్రశస్తిని భావింపజేయఁగలయవి. "రామాయణ" వ్యాసమందలి యేకదేశోద్ధరణము చిత్తగించుటకు మచ్చు.

"ప్రాచీనార్య సభ్యతయొక్క ఒకధార యూరోపునందును, ఒకధార భారతవర్షమందును ప్రవహించినది. యూరోపుధార రెండు కావ్యములయందును భారతవర్షపుధార రెండు కావ్యములయందును తన సాహిత్యమును సంగీతమును రక్షించి నిలిపియున్నవి. మనము విదేశీయులము. గ్రీసు తన సమస్త ప్రకృతిని తన రెండు కావ్యములలో ప్రకాశింపగలిగెనా, లేదా, యని మనము దృఢముగాఁ జెప్పఁజాలము. కాని భారతవర్షము మాత్రము రామాయణ మహాభారతములలో నింకేమియు శేషములేకుండగ ప్రకాశింపగలిగెననుట నిశ్చయము. అందువల్లనే శతాబ్దముల తరువాత శతాబ్దములు దొర్లిపోవుచున్నను రామాయణ మహాభారతముల స్తోత్రము భారతవర్షమున లేశమాత్ర మైనను శుష్కించిపోవుటలేదు. అనుదినము గ్రామగ్రామమున గృహ గృహమున అవి పఠింపబడుచున్నవి. కల్లుదుకాణమునుండి రాజప్రాసాదమువఱకు వాటికి సమానమైన ఆదరము కలదు. ఆ కవియుగళము ధన్యము."

అనువాదమైనను తెలుఁగులో వాక్యనిర్మాణవైఖరి గోపాలరెడ్డి గారిది రసికరంజనము చేయునది. వారి స్వతంత్ర వ్యాసములును ఆయా పత్రికలలో ఆవిష్కృతములు.

ఆంగ్ల వంగములనుండియకాక హిందీనుండియు వచ్చిన యను వాద వ్యాసములు కొన్ని పేర్కొనవచ్చును. శ్రీపాద కామేశ్వరరావు గారు తెలుఁగు పఱచిన పండిత రామదహినమిశ్ర కావ్యతీర్థుని సాహిత్య మీమాంస పుస్తకాకృతిగల వ్యాసము

ఈ మూడవ పదిలో గోలకొండ, సుజాత, శోభ, పత్రికలు కొన్ని యనర్ఘ వ్యాసములు ప్రకటించెను. బూర్గుల రామకృష్ణారావు గారు వ్యాసరచనలో సైతము ప్రధానసాచివ్యము వహించిన మేధా వంతుఁడు. ఆంధ్రసారస్వత పరిషత్తునకు నాఁటియధ్యక్షులు నూకల నరోత్తమరెడ్డిగారి ప్రకాశకత్వముతో "సారస్వత ముక్తావళి"గా బూర్గులవారి వ్యాసములు తరువాతి కాలమున సందానితములైనవి.

నవీనవాఙ్మయము - యెంకిపాటలు (1926)
ఉమర్ ఖయ్యామ్ (1927)
ఈశ్వరతత్త్వము - ఉమర్ ఖయ్యామ్ (1927)
కాకునూరి అప్పకవి జన్మస్థానము (1932)

నండూరి సుబ్బారావుగారి యెంకిపాటలపై గాలిదుమారము రేఁగిన కాలమది. ఆపాటలపై బసవరాజు అప్పారావుగారి ప్రతిక్షేప వ్యాసములు వచ్చినవి. చివరకు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారివంటి పెద్దలు కలుగఁజేసికొని లక్షణగ్రంథములలోనే యాధారమును యెంకి నాయుడు బావలపాటలకు లేదని చెప్పిరి. ఇట్టి సందర్భమున బూర్గుల రామకృష్ణారావుగారు సోపపత్తికమైన వైఖరిలో నవీనవాఙ్మయమును పరిశీలనము చేయుచు యెంకిపాటలలోని కవితాంశమును ఉదారసుంద రముగా తమవ్యాసమున ఉట్టంకించిరి. వారివ్యాసనిష్కర్ష మిటులున్నది:

"తాత్కాలికముగా వెలువడిన ఖండనములు విమర్శనములు ప్రతి విమర్శనములు ఈ యెంకిపాటలయొక్క సారస్యము నించుకయైన

తగ్గించలేవు. సహృదయులగు పాఠకులు వాటియందు మనోహరత్వము ననుభవింపకపోరు. కొన్నికొన్ని తావుల భావౌచితికి భంగముకలిగినను మొత్తముమీద పాటలు సుందరముగా నున్నవి.''

సంస్కృతాంధ్రములయందకాక ఆంగ్లము పారశీకము మున్నగు పెఱబాసలలోను బూర్గులవారు పేర్గలపండితులగుటచే వారివ్యాసములు నిశితములు, బహువిషయస్పృశములునై వెలసివచ్చినవి. వ్యాసరచనలో ఆంగ్లపదములవాడుక ఆనాఁడు కొందఱు పరిహరింపకయుండిరనుట తలఁపునకు వచ్చుచున్నది.

పానుగంటివారి సాక్షివ్యాస పరంపర ఆంధ్రదేశమున సాధారణాసాధారణ పాఠకలోకమున ఒకానొక ప్రత్యగ్రోత్సాహమును వ్యాపనము చేసినది. జంఘాలశాస్త్రి గంభీరోపన్యాసములు, వాణీదాసుడు, కాలాచార్యుడు, బొర్రయసెట్టి మాటలు తెలుఁగునాఁట ప్రతిధ్వనించుచు చిరంజీవములై యున్నవి. ఆంధ్రపత్రికలోని పానుగంటి సాక్షివ్యాసములకు తహతహతో ఎదురుచూచిననాళ్ళలో తెలుఁగు వ్యాసము స్వర్ణసింహాసనము తీర్చియుండి పాఠక హృదయములను పాలించినది. మన సంఘము, మన వాఙ్మయము మన ఆచారములు, మన రాచఱికము – వీనిలో చొచ్చుకొనుచున్న అవకతవకలనుగూర్చి నిష్కరుణముగా దుయ్యబట్టిన వ్యాసమది. హాస్యరసముచే ఆర్ద్రార్ద్రమైన యెత్తిపొడుపులతో ఓజస్వంతమైన పానుగంటివారి రచన దానికదిసాటి. ఆయనచేతిలో తెలుఁగువ్యాసము మయూర నాట్యము చేసినది. చిలకమర్తివారివి పానుగంటివారివి ఉపన్యాసము లెటులో వ్యాసములటులు. వ్యాసము లెటులో ఉపన్యాసములటులు. వారిభాష లక్షణ దూరము కాదు.

ఆమెడ, నాగపూడి కుప్పుస్వామయ్య. తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్యగారల మనుపసుచరిత్రాది గ్రంథపీఠికారూప వ్యాసములు గుణాలంకారౌచిత్యాది కావ్యలక్షణలక్ష్యములకు నిక్షేపములు,

కాశీభట్టవారి "ఉపన్యాస పయోనిధి" పేరు మోసినది. సంస్కార విషయకములు 24, అధ్యాత్మ విషయకములు 17, మతధర్మ విషయకములు 43, సాహిత్య విషయకములు 60, కవిత్వ విషయకములు 16, ప్రకృతిశాస్త్ర సంబంధులు 11. ఇటులు లెక్కకు వచ్చినవికాక మఱియెన్నో వ్యాసములు ఆపయోనిధి తరంగములు.

"అల్పదోషమైనా కావ్యమందు సహించక విమర్శచేసేటప్పుడు యమునికన్న ఎక్కువ నిర్ఘృణుడని పేరుపొందిన పండితుడు" అని గిడుగు పంతులుగారు బ్రహ్మయ్యశాస్త్రిగారిని ఉట్టంకించుటయేకాక "వెయ్యగా వెయ్యగా వెఱ్ఱివాడే గెలిచెనన్నట్లు ఈయన వ్రాతలు జనులను భ్రమపెట్టి నేను పూనిన మహాకార్యమునకుగూడ విఘాతము కలిగించుచున్నందున..." అని ఉత్ప్రాసించినారు.

ఇది సరియు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి "ప్రబుద్ధాంధ్ర" వాడుకభాషలో వ్యాసమునకు సదవకాశమిచ్చిన పత్రిక. "హిందీ"కి వ్యతిరేకవాదము చేయు శ్రీపాదవారి వ్యాసాలు పగడ్ బందీ వ్యాసాలు. వాడుకభాషలో శతాధికములైన చిన్నకథలు వ్రాసిన సుబ్రహ్మణ్యశాస్త్రిగారి రచన సూటియై ఉజ్జ్వలమైనదగుటచే పాఠకుఁడు వారి వ్యాసము లుపేక్షింపఁజాలడు.

బందరువాసులైయుండి ఆంధ్రభూమి నెల్లెడల వాగ్గేయకారులుగాఁ బేర్గనిన నాగభూషణముగారి "ఆంధ్రదేశము - సంగీతము" అను వ్యాసము (1927) గాయకలోకమునఁ గొంత ప్రతిఘటనకుఁ బాల్పడినది. దానిపై ఖండన ముండనములు వెలసినవి.

"కర్ణాటగానమన్న మొదటినుండియు నాంధ్రుల స్వీయవస్తువు. ఈ మధ్యకాలమున అరవవారు మనవారివల్ల ఆద్దానిని గ్రహించి

గొప్పవారైరి. అది కారణముగా సంగీతము దాక్షిణాత్యుల సొమ్మనెడి వ్యామోహము కొంతకాలము క్రితమువఱకు నాంధ్రుల నావేశించి యుండెను. ఇప్పుడు ద్రవిడాంధ్ర గాయకులు శైలీపాండిత్యములలోఁ దుల్యులు. విశేషతః ఆంధ్రులే అధికులు.''

నాగభూషణముగారి ఈ వ్యాససారము నాఁటి విద్వద్గాయకుల ఆంధ్రాభిమానమునకు సముదాహరణము.

వున్నవ లక్ష్మీనారాయణగారి ''సంజయ రాయబారము'' (1927)
సురవరము ప్రతాపరెడ్డిగారి జైన రామాయణము
మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారి ప్రాకృత కావ్యములు
మూఁడవ దశకములో జన్మించినట్టివి.

ఆంధ్రుల సాంఘిక చరిత్రము నుగూర్చి ప్రతాపరెడ్డిగారి పరిశీలన వ్యాసములు తరువాతి కాలమున గ్రంథాకృతి నంది కేంద్ర సాహిత్య అకాడమీ బహుమాకృతి నందుకొన్నవైనము మన మెఱిఁగినది.

రాజమహేంద్రవరములోని ఆంధ్రేతిహాస పరిశోధకమండలి కళింగదేశ సంచిక (1927) రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక అంతకుమున్ను (1922) ప్రచురించెను. భావరాజు కృష్ణారావుగారు, రాళ్ళబండి సుబ్బారావుగారు, నేలటూరి వేంకటరమణయ్యగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిన అలఘువ్యాసములు విలువకట్ట నైతికాదు.

## నాలవ పది ( 1930 - 40 )

ఈ శతాబ్ది నాలవపదిలో వ్యాస మెంత యుచ్ఛ్రయదశ నందు కొనవలెనో అంత యందుకొన్నదని నూటికినూరుపాళ్ళు తృప్తిపడుటకు అవకాశము నీయని కొన్ని లేఁతరచనలు వచ్చినవన్నచో అభిజ్ఞులు కాదన

రని విశ్వాసము. పత్రికలు, తత్సంపాదకులు, తదభిమానములు, తదాశయములు, మెల్లమెల్లగా మాఱుచుండుట దీనికిఁ గొంత కారణము కావచ్చును. ఈ యుభాండము పత్రికలపై ఏల వేయుదువన్నచో వ్యాసమునకు పత్రికలకు ఉపజీవ్యోపజీవకసంబంధము ఉన్నదనుకొంటిమి కదా!

ఒకఁడు ఒక విషయము నెత్తుకొని వ్యాసము వ్రాయును. అది అచ్చు కావలెనని అతఁడు కాంక్షించును. కానిచో, పయివాఁడు చూచుట తటస్థింపదు. చూచినఁగదా, సహానుభూతి నంది సంతోషించుటయో, వ్యాసాంశము తన సిద్ధాంతమునకు భిన్నముగా నున్నచో జవాబు వ్రాయుటయో జరుగుట? వ్యాసము వ్రాసి స్వయంప్రకటనము చేసి చదువరులకుఁ బంచిపెట్టుట యెవరికి శక్యము? కనుక, పత్రికలు సర్వత్ర విహారశీలములు. వ్యాసప్రకాశనమునకు విధిగఁ దోడ్పాటు చేసినవి. ఛాందసములగు పద్యములు కొన్ని బుజమున వేసికొని, సద్యః ప్రయోజనములగు కొన్ని వార్తలు నెత్తిన పెట్టుకొని, కలసి వచ్చిన ఒకటి రెండు కథానికలతో దీర్ఘ జీవితయాత్ర సాగించవలెనన్నచో పత్రికకు సాధారణముగా సాధ్యము కాదు. సారవంతములగు వ్యాసములు దానికి వలయును. మఱి, ఈ తరుణములో పత్రికాలోకమున బేహారము దూరక తప్పదు. భాషాభావములచే నిర్భరములగు వ్యాసములు గల పత్రిక అంగడిలో అమ్ముడువడుట కష్టము. తత్సంపాదకుఁడు కొంత పరమార్థముతో పాటు పది రూకలు రాఁబట్టుకోవలెను గదా? రానురాను వ్యాపారము ముప్పాతికయు, పరమార్థము పాతికయు నగుటతో, తాదృక్పత్రికాభిరుచుల ననుసరించి వ్రాసిన వ్యాసములు వ్యాసాభాసములైనవి; కొన్ని వెఱ్ఱితలలు వేసినవి; కొన్ని అసభ్యములు; కొన్ని అవాచ్యములు, అస్వతంత్రములు.

ఈయుభయమునకు అన్యోన్యాశ్రయము పెక్కుచోట్ల గుణము; అక్కడక్కడ దోషము.

ఈనాలుగవ దశాబ్దిలో ప్రత్యేక సంచికలయందు, గ్రంథసంపుటము లందు వ్యాసము వేటొక వైపు తన విశ్వసుందర రూపమును ప్రదర్శించుచునే యున్నది. ఏకాలమందేని ఏ ప్రక్రియయందేని మేలుగీళ్ళు ఆయా పాళ్ళలో చూపించ వచ్చును.

''న శబ్ద బ్రహ్మోత్థం పరిమళ మనాఘ్రాయ చ జనః
కవీనాం గంభీరే వచసి గుణదోషౌ రచయతు,,

మన కవులు వ్యాసకర్తలు. కవిత్వ వ్యాస క్షేత్రమున రాజనములు పండించినవారిని, అవిచ్ఛిన్నముగ పండించుచున్నవారిని మనము మఱచుట యెట్లు?

కట్టమంచి రామలింగారెడ్డిగారు. పింగళి లక్ష్మీకాంతము గారు, వేలూరి శివరామశాస్త్రిగారు, విరాజమానులై యున్న విశ్వనాథ సత్యనారాయణగారు, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు - వీరిదొక సాహిత్యపంక్తి, దీనికిఁ జెందఁగల పాంక్తేయులు దయచేసి కొందరున్నారు. ''ద్విత్రాః పంచషా వా గణ్యన్తే'' అనికదా;

ఈ శ్రేణి నాల్గవపదిలో వ్యాసభాషాచిరంటికి విశేషక రచనయే చేసినది. వీరందరు ఛందోరహస్యవేత్తలు, వాగ్యోగవిదులు. వీరి చేతి తెలుఁగు వ్యాసము అంతర్బహీరూపములలో సంగీతకధర్మము ఔచిత్యోర్జిత్యములు, ఆభిజాత్యము, ధ్వనిస్ఫూర్తి ప్రోవుచేసికొని క్రొత్తతావులు గ్రుమ్మరించినది. ఒక కావ్యఘట్టము చదివి భావించుకొని యానందించుట కెట్టి హృదయసంస్కార మవసరమో, తాదృక్సంస్కారధార పొలిచినవేళ, అవధానము నిలిచినవేళ తద్వ్యాస ఫలము సుగ్రహమగును. మనమనుకొన్న వ్రేళ్ళ లెక్కవారు వాడుక భాషను వేడుకపడినవారే. ప్రాయశః గ్రాంధికము. ''ఉభయ తస్పాశారజ్జుః''

ఈ చతుర్థదశకములో సుప్రతీతమైన "ప్రతిభ" నుండి వెలసిన విశ్వనాథవారి "కృత్యాద్యవస్థ" శిష్టభాషలో తెలుఁగు వ్యాసపు సర్వాంగీణ సమాఖ్యకు సూక్ష్మరూపము. ఒకచోట వారన్నారు :

"...సంస్కృత కవులు, అందులో నాటకకవులు పడ్డ యీ అవస్థ శిల్పాచార్యకమా అన్నట్టుంది. ఆ కవులు మొదలుపెడుతూనే అగాధమైన విషయంతో మొదలుపెట్టడమో ఒక్కసారిగా పఠితను రసాబ్ధిలో ముంచడమో చేస్తారు. వాళ్ళు కావ్యాన్ని చూచే వైఖరియే వేరు. షేక్సుపియరు నాటకాల్లో ఆయన రాయబోయే కథలో వుండే సమస్యాఘట్టాన్ని మొదటి రంగాల్లో ప్రదర్శించి వదలిపెడతారు. తక్కిన నాటకం ఈ సమస్యాపూరణం..." మఱొకచోట అన్నారు :

"...ఇట్లా బహుకథోపనదులను సంగ్రహించుకొని యీ కర్మకథాప్రవాహం భారత సముద్రగామిని అయింది. ప్రారబ్ధకర్మను మనము గుర్తుపట్టలేము. దారిలో ఆగామిసంచితాలు వస్తవి. ఇవన్నీ కలిసి ఏం పరిణామం పొందుతవో తెలియదు. మొత్తానికి ఈ సృష్టి అంతా చుట్టిన చాపవంటిది. పఱచినకొద్దీ పోయి చివర కనబడాలిసిందే తప్ప అంతవరకూ కనబడదు. అయితే ఆ చివర పఱచినప్పుడుమాత్రమే లేదు, చుట్టినప్పుడూ ఉంది. ఆదిమధ్యాంతముల సమష్టి సంక్షిప్తి ఈ సృష్టి అనడం ఈ సృష్టిరహస్యాన్ని తమ కావ్యాల్లో వ్యంగ్యభూతంగా ఉంచటం ఈ కర్మభూమిలో ఉన్న మహాకవులు తెలిసినదీ చేసినదీ అయిన విషయం."

అంతర్వస్తుపటిమతో వాక్యార్థశిల్పముతో విశ్వనాథవారి వ్యాస మొక స్వమాత్త్వమును సిద్ధింపఁజేసికొన్నది. "గ్రామ్యమా? వాడుకభాషా?" అన్న నాఁటి విశ్వనాథవారి వ్యాసము జయంతిలో ప్రచురితమై భావనాప్రకటమైన వారి లోకజ్ఞతకుఁ దార్కాణమై నిలిచినది. వారు చేసికొన్న తీర్మానము ఎట్టిదనఁగా, చిత్తగింపుడు :

"సభలలో మాట్లాడేది సభ్యం. ఈ వాడుకభాష సభలలో అది గ్రామ్యం అనేవాళ్ళుకూడా మాట్లాడుతున్నారు. బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి ఉపన్యాసం రక్తిగా ఉంటుందంటే ఎందుకని ? వారు వాడుకభాష ప్రయోగిస్తారు. కాకుధ్వని వాడుకభాషలో ఉన్నది. గ్రాంథికభాషలో కాకువు సాధించుకోవాలి. గ్రాంథికభాషావాది అన్నకొద్దీ కాకువు రమ్యత తెలియనివాడని అర్థము. కాకువు అంటే భావద్యోతకానికి ఉచ్చారణలో చూపే ఒడుపు. ఆ కాకుధ్వనిని గ్రాంథిక భాషకన్న వాడుకభాష మిక్కిలిగా ప్రయోగిస్తుంది. నేను మా నందమూరులో చిన్నతనంలో నాకు నచ్చిన భాషా, నేను చదువుకోగా నాకు వచ్చిన భాష రెండూ నాలో కలిసియే పరిణామం పొంది నా నోటివెంట వస్తుందో, అది మాట్లాడతాను అదే వ్రాస్తాను..."

ఇపు డిన్నివాక్యములు వారివి ఎత్తి యేల చూపితిననఁగా, వ్యాసభాష గ్రాంథికము కావచ్చు; వాడుకలోనిది కావచ్చు, కాకు స్ఫురణ రమణీయత ముఖ్యము. భావద్యోతకమునకు మిగిలినవి గౌణములు.

మఱి, ఆ నాలవ దశాబ్దమున రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి రాయలనాఁటి తెలుగు సాహిత్యము (1937) వంటి వ్యాసములు భావుకులైన భారతీపాఠకుల హృదయరంగముల గొండ్లి యొనర్చిన వన్నచో అధికోక్తి కాదు. రాళ్ళపల్లివారి సంతరింపు వ్యాసమున కొక సంగీతపు సొంపు ప్రసాదించినది. తొలినుండి తలపొలముదాఁక ఏకాగ్రమైన చిత్తముతో చదివించెడి గుణము వారి వ్యాసమునకు జనుస్సిద్ధము. ఒక్కొక్క విషయమును కిందుమీఁదులుచేసి మార్చిమార్చి పిష్టపేషణము చేయు లక్షణము వారికి గర్భశత్రువు. మోమోటమి లేదు. సంయమ సుందరమైన ధీరలలితమైన ఆవిష్కారము – సుకుమారమైన హాస్యము – ఇవి వారి వ్యాసముయొక్క కూటస్థగుణములు, వేమనపయి వచ్చిన వ్యాసగ్రథనము నాఁటినుండియు ప్రసిద్ధిగాంచి వచ్చుచున్నది.

"బాలవ్యాకరణము అప్పకవీయము మొదలగువాని దెబ్బలకు వేమన పద్యము లెంత నులినులియైనవో చెప్పిలేఁదు... తెలుగువంటి బ్రతికియుండు భాషలో ఇవే అపశబ్దములు ఇవే సుశబ్దములని నికరముగా శాశ్వతముగా నిర్ణయించుటకు పూనుకొనుట వట్టివెఱ్ఱియని యిన్నాళ్ళకును దెలిసికొనలేకపోవుట మన తప్పుగదా!" అన్నారు. ఇది యెన్నాళ్ళకితమో రాళ్ళపల్లివారు చెప్పినమాట. మనము మఱికొన్నాళ్ళు వేచియుండవలయును.

పింగళి లక్ష్మీకాంతముగారి వ్యాసము వాఙ్మయవిమర్శకముగా ముంగలిగా నిలబడునది "పాళీ - తెలుఁగు" (1931) అనునదియు కాక ద్విపద భారతము, రంగనాథ రామాయణములకు వీరి పీఠికా వ్యాసములు ఆయా ప్రాచీనకవులు కవిత్వమునుగూర్చి తరతమ వివేచనముతోఁ జేసిన సిద్ధాంతవ్యాసములు విశ్వవిద్యాలయములలో సారస్వత వేదికలలో మఱుసవ్వడులు చేయుచునేయున్నవి. ఆయన వ్యాసవాణి ప్రమితము; కవితాధర్మవిలసితము; స్పందసుందరము.

ఆనాఁటి వేలూరి శివరామశాస్త్రిగారి వ్యాసలేఖిని ఒక యోగదండము. "భారతి" కపూర్వమైన ఆకల్పము, ఆయన నిర్మాణములో వ్యాస మొక ధ్వనికావ్యము. ఉనికి - ఎఱుక మున్నగు తాత్త్వికములు, ప్రాచీన భూగోళము - ప్రాచీన ఖగోళము (1937) వ్యాసపరంపర మఱచిపోనీయవు. బహుభాషాగత బహుగ్రంథపరిశీలనముతో అనుభవమునకుఁ దెచ్చుకొన్న శాస్త్రవిజ్ఞానసారమును స్వాదువ్యాసరసోన్మిశ్రము చేసి ఆయన పిపాసువులకుఁ బ్రసాదించెను. తన శతావధానిత వ్యాసక్షేత్రమందును అధికముగా వెల్లివిరియఁజేసిన విద్వాంసులు శివరామశాస్త్రిగారు.

వేలూరివారి వ్యాసములకు అధస్సూచికలు "ఫుట్ నోట్సు" ప్రత్యేకాభరణములు. శాస్త్రీయ విషయములలో పాఠకుడు తప్పక పూర్వప్రమాణమును కోరును. వ్యాసపఠన సమకాలమున నే దానికిఁ

ప్రమాణము ఎక్కడిదో తెలిసికొనుటకు చదువరికి ప్రమేయము కలుగును. ఎప్పటికప్పుడు వ్యాసము పాఠకుని సంశయము నివర్తింపఁ జేయుచుండవలెను దానికొఱకు ''అధోజ్ఞాపికలు'' వ్యాసమునఁ బ్రవేశించినవి. ఈ విధానము వ్యాసకర్తయెడలఁ బాఠకునకుఁ బ్రమాణ భావమును పెంచును. ''ప్రాచీన భూగోళము'' వ్యాసములో వేలూరి వారి వాచాసరణి :

''ఇది కొన్ని వేల యేండ్ల క్రిందటి భూగోళము. అది యెన్ని మార్పులొందెనో యెవరెఱుఁగుదురు ! సరస్వతీనది పూడిపోయెను, ''తరిమ్'' భూగర్భమునకు పోయెను. తొల్లి సముద్రమున్న చోటునఁ గదా నేఁటి హిమాలయము ! సహారా ఒకప్పుడు సముద్రము. మొన్న భూకంపమున బీహారులో ఒక నది యేమాయెనో తెలయనిది కాదు. నేఁడు కనులయెదుట హిందూస్థానముమీఁద పాకిస్థాన్ ఆవిష్టమైనది. ''పురాయత్ర స్రోతః'' అట్టితటి నాటిద్వీపములు బద్ధించినట్లు కనబడక పోయినంతమాత్రమున నిదియంతయు కల్లయని యంగీకరించుటకు ప్రతికూల సాక్ష్యమును కొంత కలదు.''

మఱియొకఁ డిదే భూగోళశాస్త్ర విషయమును దీసికొని మట్టి చేసి విడిచిపెట్టను వచ్చును. వేలూరివారి చేతి పరుసవేదితో వ్యాస వస్తువు ఇసుమేని మేలిమి కావలసినదే ! ఈ దశకము కొనలో (1940) ''ఆంధ్రి'' సారస్వత మాసపత్రిక శివరామశాస్త్రిగారి ''గారుశబ్ద విచారము'' వెలువరించెను. ''గారు'' శబ్దము పుట్టుపూర్వోత్తరములు చెప్పుచు వ్రాసిరికదా !

''ఇపు డాత్తరేయులు గారు మొదలైన (ఆపని) బహువచన ములఁ దొలఁగించి (తుమ్, తుమి) చేసివేయవలయునని యొక యుద్యమ మారంభించుచున్నారు. కాని యిది సఫలము కాదు. స్వభావము దురతి క్రమము. మదరాసు దొరతనమువారు యమ్మారార్వై తీసివేసి ''శ్రీ'' యనిరి. కాని కోర్టుభాషలో నీవు తప్ప మీారు లేదు. ఇది చింత్యము.

లోకవ్యవహారమున "నీవు" తుడిచిపెట్టుకొనిపోయెను. ప్రేయసికిఁగాని ప్రియతమునకుఁగాని 'గారు' లేదు. పరోక్షప్రత్యక్షములలో తేడాకలదు. 'హరినాగభూషణం ఏంపాడేశాడోయ్!' "నారాయణదాసు ఏంహరికథ చెప్పాడోయ్ !" అని అందురు. ప్రత్యక్షమున ఈయేక వచన ప్రయోగము చేయరు. అటు చేయుచో డొక్కబద్దలగునని వారికి తెలియును. ప్రతిష్ఠగలవారందరకు ప్రత్యక్షములో "గారు" తగులును. గోడచాటగుచో పేరే మిగులును. వారు గోడచాటున పొంచుండి ఈ యేక వచన ప్రయోగమునకు సంతాపపడవలసిన పనిలేదు. కాళిదాసునెవరు కాళిదాసుగారని యనరు. మృత్యువు లేని వారికెవరికిని గారు లేదు. ఒకవేళ నున్నను అర్థము లేదు. ఇన్ని దేశములలో ఇన్ని దర్శనములలో దేవుని చివర నెవరేని గారుచూచి యున్నారా!"

వ్యాసము పరిణతావస్థకు వచ్చుట యనఁగా ఎత్తుగడ, విషయా విష్కరణము, సత్యసుందరమైన భావనము, శైలి ఇట్టివాని ననుసరించి సహృదయుని అనుభవము తోడి నిర్ణయము. "జీపురుపుల్ల" పై శతకము చెప్పిన కవి యుండెను. వ్యాసమునకు వస్తువు ఉపసర్జనమే యగుచున్నది.

ఇఁక. రామలింగారెడ్డిగారి "వ్యాసమంజరి" ఈ నాల్గవపదిలో పూఁచినది. ఇందాక, లెక్కించుకొన్న పంక్తిలో కట్టమంచివారు జన్మతః అగ్రేసరులు. "విమర్శకులలో వీరికెంత ప్రాధాన్యమున్నదో వ్యాస రచయితలలో అంత ప్రాధాన్యమున్నది. సాహిత్యాంగముగా పరిగణింపదగిన వ్యాసరచన ఆంగ్ల భాషలోవలె మన భాషలో ఇంకను పరిణతావస్థకు రాకున్నను, జరిగినంతవఱకు దాని పెంపునకుఁ గారణ భూతులైన విద్వాంసులలో వీరొకరు" అనునది లక్ష్మీకాంతముగారి మెచ్చు. రామలింగారెడ్డిగారి వ్యాసమంజరి పూర్వాఖండము, అభిజన ఖండము, భాషాఖండము, ఆధునిక కవితాఖండము, సాంఘిక ఖండముగా విభజింపఁబడియున్నది. సుకుమార హాస్యమునకు, వక్రోక్తి

లకు, మోమోటమి లేమికి, ఆత్మోన్నతి కల్మికి రెడ్డిగారి వ్యాసములు పరసీమలు. "నాఁటికి నేఁటికి రెడ్డియొక్కఁడే" అని ఋతుసంహారము లోని వక్కణము.

౧. విద్యాప్రవృత్తి, ౨. స్వయంవరములు రాక్షసవివాహము లౌనా ? కావా ? 3. హిందూమత పరిణామములో భజనకూటముల ప్రాముఖ్యము మున్నగు వ్రాయసములె కాక, గాథాసప్తశతీసారము, కృషీవలుఁడు, ఆంధ్రవాఙ్మయ చరిత్రము, సర్వలక్షణసార సంగ్రహము మొదలగు కృతులకు వ్రాసిన తొలిపలుకు వ్యాసములు రెడ్డిగారివి తెలుఁగుబాసకుఁ గైసేఁతలు.

ఈ నాల్గవ దశకముననే 1934 లో ఆంధ్రవిశ్వవిద్యాలయము జయంతి రామయ్యపంతులుగారి "సువిస్తృతోపన్యాసము" (Extension Lecture) ఆధునికాంధ్రవాఙ్మయముయొక్క వికాసవైఖరు లను గూర్చి వాల్తేరు, కాకినాడ, గుంటూరులలో విద్యార్థుల ప్రయో జనమునకు ఏర్పాటుచేసెను. ఆ ప్రసంగ వ్యాసములు "ఆధునికాంధ్ర వాఙ్మయవికాసవైఖరి" అను పేర గ్రథింపఁబడియున్నవి. అందలి మూఁడవ వ్యాసాధ్యాయమునుండి కొన్ని సూక్తు లధ్యయనము చేయఁబడుచున్నవి :

"వీరేశలింగముగారు శరీరశాస్త్రమును, జ్యోతిశ్శాస్త్రమును ఆంధ్రీకరించినారు. ఆంగ్లేయభాషలో నుండు భౌతికశాస్త్రములును తెలిఁగించుట కిది మొదలు. ఇఁకముందీ శాస్త్రములన్నియుఁ గళాశాల లలో దేశభాషయందే విద్యార్థులకు బోధింపవలయునని సంకల్పము పుట్టినది. ఈ సంకల్పము నాచరణములోఁ బెట్టవలయునన్న నాంగ్లేయ గ్రంథముల దేశభాషలోనికి మార్చవలయును. అట్లొనరించుటకు ముందుగాఁ బరిభాషాపదములు 'Technical terminolgy' కుదురవల యును. పాశ్చాత్యభాషలన్నిటియందు శాస్త్ర పరిభాష గ్రీకులాటిను భాషలయందుండును. అట్లుండుటచేత ఒక్కశబ్దమే యన్ని భాషల

యందు వినియోగపడుచున్నది. ఆ ప్రకారమే యీ భరతఖండమునందున్ని దేశభాషలకును సమానములగు శాస్త్రపరిభాషాపదములను సంస్కృతభాషలో రచింపవలసియున్నది. మంచి సంస్కృతాంగ్ల సాహిత్యములుగల పండితులు పరిశోధించినచోఁ బెక్కుపదములు సంస్కృత వాఙ్మయమునందు సిద్ధమైనవే దొరకునని నా నమ్మకము. కేవల భౌతికశాస్త్రపదములు కొన్ని దొరకకపోయినను, అట్టి శబ్దముల క్రొత్తగా రచింపవలయును. ఈ పరిభాషానిర్మాణము ముందు జరిగినఁగాని భౌతికశాస్త్రగ్రంథములను దేశభాషలోనికిఁ దెచ్చుటకు వీలుండదు.''

నాఁటి రామయ్యపంతులుగారివంటి లోకసాధువుల యీ నాందీవాక్కు నేఁటి తెలుఁగు అకాడమీ రూపమున అర్థానువర్తనము చేయుచుండుట హర్షింపఁదగిన విషయము.

మఱి - కోరాడ రామకృష్ణయ్యగారి ''సారస్వత వ్యాసములు'' 1935 లో గ్రంథాకృతికి వచ్చినవి. 'జాతీయ జీవనము - వాఙ్మయము,' విమర్శన పద్ధతులు, నన్నయకుఁ బూర్వ మాంధ్రవాఙ్మయస్థితి, ఆంధ్ర వాఙ్మయము - యుగవిభజనము, భారతాంధ్రీకరణము అను వ్యాసములు కోరాడవారివి తలస్పర్శియైన పరిశ్రమకుఁ బ్రస్ఫుటోదాహరణములు. మదరాసు విశ్వవిద్యాలయమువారి పరిశోధనశాఖకు రామకృష్ణయ్యగారి వ్యాసములు రసవత్ఫలములు.

ఈ దశాబ్దిలో ప్రముఖముగాఁ బేర్కొనఁదగినది ఆంధ్రేతిహాస పరిశోధక మండలివారి ''కాకతీయ సంచిక'' (1935). మారేమండ రామారావుగారి సంపాదకత్వమున వెలువడిన యీ సంచికలోని పాతికముప్పది వ్యాసములు కాకతీయ సామ్రాజ్యమును గుఱించిన సర్వాంకషపరిశీలనమునకు దర్పణములు.

కాకతీయుల చరిత్ర, హనుమకొండ స్థానిక చరిత్ర, విద్యానాథుని కాకతీయాన్వయ నిరూపణము, కాకతీయసామ్రాజ్యాంధ్ర

వాఙ్మయము, కాకతీయరాజ్యము - భౌతికస్వరూపము, "కాకతీయులు-కళింగము," ఓరుగల్లు చరిత్ర, పాల్కురికి సోమనాథుఁడు, కాకతీయుల నాఁటి సాంఘికచరిత్ర, మున్నగు వ్యాసములు యథాసంఖ్యముగా -

మా రేమండ రామారావు, పింగిలి వేంకటేశ్వరరావు, రుద్రరాజు నరసింహారాజు, నిడుదవోలు వేంకటరావు, రాళ్ళబండి సుబ్బారావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ మౌల్వీ సయ్యద్ అహమదుల్లా ఖాదిరీ సాహెబ్, బండారు తమ్మయ్య సురవరము ప్రతాపరెడ్డి మున్నగువారు వ్రాసినవి కాకతీయ సంచిక నలంకరించియున్నవి.

1935 ప్రాంతములో ఓరుగల్లున కాకతీయోత్సవము "మండలి" జరిపించినది. ఆ పుణ్యములోఁ గొంతపాలు మా రేమండవారిది. నాఁటి ఆహ్వానసంఘాధిపతి శ్రీ పింగిలి వేంకటరామారెడ్డి దేశ్‌ముఖ్‌గారి ప్రసంగ వ్యాసభాగము ఇపుడు జ్ఞప్తి చేసికోఁదగినది.

"కాకతీయుల విషయములో రెండుమూఁడు మాటలు చెప్పఁదలఁచినాఁడను. మనలో చరిత్రలు తక్కువయని సులభముగా విమర్శింతురు. మన దేశపరిస్థితు లెట్లుండెనో ఆ కాలమందలి అల్లకల్లోలములలో గ్రంథములు నాశనమగుటకు అవకాశము లెట్లుండెనో విచారించక వీరిట్లు మాట్లాడుదురు. ఇటీవల కొన్నియేండ్లనుండి యనేక కావ్యాదులనుండి శాసనములనుండి స్థానిక కైఫీయతులనుండి కాకతీయ చరిత్రలోని బహుభాగము గుర్తింపఁబడి వ్రాయఁబడి యున్నది. ఓరుగల్లునగరము, హనుమకొండ పట్టణము సుప్రసిద్ధస్థలములైనవి. మనకేకాదు, ఖండాంతరవాసులైన మార్కోపోలో వంటి వారికిని నాటికి నేటికి చిరపరిచితములైనవి. ఓరుగల్లు సామ్రాజ్యము వలన ఆంధ్రుల భాషయేకాక ఆంధ్రుల సర్వకళలును వృద్ధిపొందెను. ఆంధ్రుల ప్రతిభ దిక్కుదిక్కులకు వ్యాపించెను..."

అపిచ, ఆనాఁటి కాకతీయసభలో ప్రొఫెసరు సిరుగూరి హనుమంతరావుగారు అధ్యక్షతనొంది, చేసిన వ్యాసభాషణము పౌనఃపున్యముగ స్మరణయోగము.

"దొరతనమువారు ఎంతద్రవ్యము వ్యయముచేసినను, ఎంత పరిశోధన సామగ్రి సంపాదించినను పరిశోధన సంపూర్ణముగ జరగవలెనన్న విద్వత్సంస్థలయొక్కఁయు ఇతర విద్వాంసులయొక్కఁయు సాహాయ్య మత్యవసరము. పూనా భండార్కర్ ఇన్స్టిట్యూటు, బెంగుళూరు మిథిక్ సొసైటీ, రాజమహేంద్రవరమునందలి యాంధ్ర పరిశోధక సంఘము-ఇట్టివి జనులయొక్క చరిత్రవృద్ధికి మిగుల తోడ్పడినవి. దాదాపు పది సంవత్సరముల క్రిందట నైజాం రాష్ట్రాంధ్రుల కొఱకు పరిశోధక సంఘము స్థాపించిన శ్రీ మునగాల రాజుగారికి ఇతర నిజాం రాష్ట్రాంధ్ర ప్రముఖులకును వందన శతములు. ఈ ఆంధ్ర ఆర్ష శాఖా స్థానము హైదరాబాదునందలి శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయమే ఈ భాషానిలయము భాగ్యనగరవాసులగు ఆంధ్రుల ప్రజ్ఞావిశేషములకును అత్యుద్ధతికిని మిగుల తోడ్పడుచున్నది."

కిం బహునా! నాల్గవ దశాబ్దిలోని చారిత్రకవ్యాసమణులకు కాకతీయ సంచిక కాంచనమంజూషిక.

తాపీ ధర్మారావుగారి "విజయవిలాస వ్యాఖ్యా విధానము"
తల్లావఝ్ఝులవారి "కథానిక పరిణామము" (1939)
కవికొండలవారి "భావకవిత్వము" (1934 ప్రబుద్ధాంధ్ర)
ఇంద్రగంటివారి "సీతమ్మశోకము - పాపరాజు" (1932 భారతి)
రాయప్రోలువారి "కవితాభిరుచులు" (1939)
పాటిబండ మాధవశర్మగారి "కవిత్వము" (1934)

ఇట్లు సారస్వతాంశములను గ్రహించి వచ్చిన వ్యాసములు లెక్కకు మీఱి, లోకాలోకములై యున్నవి.

ఆ నడక అటులు సాగుచుండ, ఛందోగతులయెడ యువలోకములో నిర్బంధము సడలి స్వచ్ఛందగతిపై చూపు పార్వాఱుచున్న తీరులు "వ్యాసము" గమనించుచున్నది. ఆధునిక కవులు ఇతర దేశాల కవుల రచనలలో హృదయ దఘ్నముగా మునింగి తేలుచున్న సమయమది. ప్రాచీనమైన లక్షణ భాషమీఁద దిగ్దంతుల జైత్రయాత్రలు, సాధ్యమైనంత విజయము ఇంతకు ముంగలి దశాబ్దములలో ఎట్లు సాధింపఁబడినదో, అట్లే ఛందస్సంప్రదాయములపై కొందరు నవ్యులు నడపిన శృంఖలాశైథిల్యోద్యమము ఫలవంతమైన దనిపించుకొనుచున్న కాలమది.

1939 లో శ్రీరంగం శ్రీనివాసరావుగారి "నేఁటి తెనుఁగు కవిత క్రొత్తపోకడలు" అన్న వ్యాసము నాఁటి యుద్గమము.

"గ్రాంథిక భాషను విసర్జించినట్లే ఈ గేయాలనుకూడా మన కవులు ఎప్పుడు పరిత్యజిస్తారో! సాహిత్య పరిణామం గుర్తిస్తే ఇందుకు ఎంతో కాలం పట్టదని చెప్పవచ్చును."

"నిస్సందేహంగా ఇకముందు పదిసంవత్సరాలూ వచనగమ కాలలో క్రొత్త పరిశోధనలకు వినియుక్తం కాబోతున్నది. జ్వాల, ఉదయిని వంటి పత్రికలు అట్టి అన్వేషణలకు కర్మాగారాలుగా పనిచేశాయి!

"సంప్రదాయాలను ధ్వంసం చేయడం కళాశాలి కొక క్రీడ కాదు. ఎంతో అవసరం కలిగి వీటి వినాశనం వల్ల నే లోకాన్ని ముందుకు తీసుకు వెళ్ళవలసి ఉంటుందన్నప్పుడే అతడిందు కుద్యమిస్తాడు. తన ప్రజ్ఞాతిశయంవల్ల నూతన సంప్రదాయాలను విధిస్తాడు." శ్రీరంగంవారి నీతి నిర్వాచనాలు.

తెలుఁగు వ్యాసము క్రొంగ్రొత్త పోకడలు వోయిన కాల మీదశాబ్దము. శీర్షిక, ఉపక్రమోపసంహృతులు మొదలగు వెలిరూపులో పెద్ద మార్పు గోచరింపకున్నను, సమష్టితః వ్యాసము యొక్క అంత

రంగమునందు విస్పష్టమైన పరిణామము ఏకదేశముగా రాకపోలేదు. అంతరంగశబ్దము నిచట స్వాభావార్థమున వాడితిని. వ్యాస స్వభావమున ఒకానొక "పారిప్లవస్థితి" చోటు చేసికొనుచున్న సమయమది. పర భావమును గ్రహించి దానిని స్వభావముగా ఆవిష్కరించుటకు వ్యాసము యత్నించుచున్నది. వ్యష్టిస్తోత్రము; సమష్టినింద; సౌశబ్ద్యమునెడల అనాసక్తయోగము; భావముపట్టున దురావేశము; ఆపద్ధర్మముల యెడాటమున అనురాగము; ప్రత్యవాయములయెడ విశ్వాసము; ఆచరణమునెడల అసడ్డ, ప్రచారమున శ్రద్ధాళుత, తనకింతచోటిచ్చిన నేల విడిచి సాముచేయు సాహసము — ఈ లక్షణములు కొన్ని తెలుగు వ్యాసములలో ఎడనెడ తొంగిచూచుటయు ఉన్నది. వ్యాస వీధులలో వాటుఁగాలి నడకలు, తెరువాటులు గొట్టుటయు చూడఁ గలము. జ్యోతిష్కులు జాతకము చూచి దశాచ్ఛిద్రమని చెప్పు చుందురు. ఒక గ్రహము నిర్గమించుటకుముందు కొన్నాళ్ళు వేఱొక గ్రహము ప్రవేశించుచుఁ గొన్నాళ్ళు కొన్ని యిబ్బందులు తెచ్చును. అవి మెల్లగా తొలఁగిపోవును. ఆనాటి వ్యాసముయొక్క గోచారము అట్టిది.

## అయిదవ పది ( 1940 - '47 )

ఈ అయిదవపదిలోని తెలుఁగువ్యాసము ఒక భావసమన్వయము నకు యత్నము చేసికొన్నది. వాఙ్మయమున సారసాహిత్యపౌష్కల్యము ప్రసాదించు కల్యాణవ్యాస వితరణము చేసినవారు ఎందఱో! కొందఱు ప్రకాశమానులై చేయుచునే ఉన్నారు. చేయ వలంతులు.

జొన్నలగడ్డవారు, జటావల్లభులవారు, దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు, త్రిపురనేనివారు, కుందూరి ఈశ్వరదత్తుగారు, నేదునూరి గంగాధరముగారు, ఆత్మకూరి గోవిందాచార్యులుగారు, పప్పూరి రామాచార్యులుగారు, భమిడిపాటి, మొక్కపాటి, మునిమాణిక్యములు, కాటూరి, కురుగంటివారలు,

నాఁడాది, నేఁటికిని, అవిచ్ఛిన్న వ్యాసవ్యాసంగులగు గడి యారము వేంకట శేషశాస్త్రిగారు, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు, పుట్టపర్తి నారాయణాచార్యులుగారు, దివాకర్ల వేంకటావధానిగారు, దేవులపల్లి రామానుజరావుగారు, జమ్ములమడక వారు, ఖండవల్లి వారు, నార్ల వేంకటేశ్వరరావుగారు, పురిపండా అప్పలస్వామిగారు, నోరి నరసింహశాస్త్రిగారు, దీపాలవారు, బులుసు వేంకటరమణయ్య గారు, వేదులవారు, ఇంద్రగంటివారు, గణపతిశాస్త్రిగారు, తిరుమల రామచంద్రరావుగారు, అబ్బూరివారు...

అబ్బో ఈశతాబ్ది అయిదవ దశాబ్దిలో ఆంధ్రవ్యాసవాగ్దేవీ పదసరోజాత యుగళీసన్నిధిని, చతుష్షష్ట్యుపచారములకు దీక్షితులై చరితార్థులైనవారు, అవిశ్రాంత పూజానిష్ఠులు ఎందఱో!

స్ఫురణాలసత్వమొకటి; వ్యాసవిస్తర భీరుత్వమొకటి. సర్వం కషముగాఁ జెప్ప లేకపోవుచున్నాను.

ఆనాఁడు సంపుటములలో, ప్రత్యేక సంచికలలో. గ్రంథములలో వ్యాసప్రవేశ ప్రకటనముల కవకాశము కలుగుటచే సాధారణ పత్రికా నిరపేక్షములై వ్యాసములు స్వతంత్ర ప్రతిపత్తిని సాధించుకొన్నవి. తరువాతఁ దరువాత సారస్వత పత్రిక ఇంగువకట్టిన గుడ్డ; బెల్లము వండిన ప్రొయ్యి.

మఱియు, డిగ్రీలు లేని పాండిత్యంబు వన్నెకురాని పాడుకాలము ప్రవేశించినదని పెద్దలు భావించుచుండఁగా, మహాత్ముల నాందీ వాద ముతో శతసహస్రాధిక మహనీయుల స్పృహణీయ త్యాగములతో సాంధించుకొన్న భారత స్వాతంత్ర్యము ఆదిత్యోదయముగాఁ దోఁచి నది. సర్వభారతీయులకు అఖండితమైన యొక జ్ఞప్తి కాలమది. 1947-"సర్వజిత్తు" అన్వర్థమనిపించుకొన్న సంవత్సరమైనది. ఆ మహాభారత వ్యాసమున మన ఆంధ్రము ఒక పర్వము; ఒక ఘట్టము. ఒక అంగము కదా!

పర్జన్యవల్లతుణప్రవృత్తిః :- భరతఖండముపై కురిసిన పర్జన్యము మన రాష్ట్రమునందును స్వాతంత్ర్యవర్షము కురియకుండ లేదు. దానిలో కొన్ని వంతులు సారస్వతమునకు, వ్యాసక్షేత్రమునకు "పంపిణీ" జరిగినది. స్వాతంత్ర్యసిద్ధ్యనంతరము భారతదేశమున కెట్టి రక్షణభరణ బాధ్యతలు నెత్తినపడినవో, అట్లే ౧౯౪౭ నాఁటి తెలుఁగు వ్యాసము కూడ భవిష్యమునకు ఎన్నో పూచీలు తలమోచికొని యున్నటులు తోఁచుచున్నది.

ఇంతకుమున్నే ప్రసక్తము కావలసియున్న చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారి "తెలుగు వ్యాసము" ఈ వ్యాసమునకు మంగళాంతముగా అట్లే యుంచితిని. ఆయన ఆనాళ్ళలో విలు వదలని భీష్మునివలె తన కలముతో "కథలూ - గాథలూ" వ్రాసి బండ్లఁదోలినారు. ఆంధ్ర పత్రిక, కృష్ణాపత్రిక మరి యెన్నోపత్రికలు చెళ్ళపిళ్ళవారి వ్యాసములచే పరిశోభితములైనవి. పండితులు, పామరులు, వృద్ధులు, విద్యార్థులు, స్త్రీలు, పురుషులు, నాగరకులు, ఛాందసులు - తియ్యనీటికి చేపలవలె చెళ్ళపిళ్ళవారి వ్యాసములకు అలవాటుపడిరి. ఆయన వ్యాసము దేశ కాలదర్శి; దానికి లక్ష్యముకాని విషయము లేదు; ప్రత్యేకమైన శిష్ట వ్యవహారభాష ఆ వ్యాసమునకు వజ్రాంగి.

౧. మద్యనిషేధం అవసరమే ౨. ఈతిబాధలు ౩. ఆచార భేదాలు ౪. నీలాపనిందలు ౫. సిగ్గూబిడియమూ ౬. సస్యగర్భ భూదానం ౭. గర్భాధానం ౮. కళలకోసరం దేవదాసీజాతి ౯. కళలను ప్రదర్శించే స్త్రీలు స్వతంత్రులుగా ఉండాలి ౧౦. నేనూ, మా తిరుపతి శాస్త్రుర్లూ ౧౧. నా గురు పరంపర ౧౨. సోమరిసత్రాలు ౧౩. శ్రీనాథుఁడు శ్రీరాముఁడు కాడు. ఇటులు వందలకొలఁది వ్యాస ములు. వేలకొలఁది పుటలు. "కథలూ, గాథలూ" మూఁడు సంపుట ములు కాఁబోలు, ఇటీవలి కాలమున అచ్చుపడి వచ్చినవి.

భాషాభావములయందు ఇంత విశ్వజనీనము విశ్వతోముఖము సమన్వయ సమర్థమునైన చెళ్ళపిళ్ళవారి వ్యాసము ఈ శతాబ్ది పూర్వార్థమునకు మెఱవడి, ఉత్తరార్థమునకు ఒరవడి. "ఆచార భేదాలు" అను వ్యాసమునుండి చూచాయగాఁ గొన్ని పంక్తులు.

"మన భరతఖండంలో యేయే ఆచారాలు హేయంగా మనం భావిస్తామో అవసరమైతే అవన్నీ యూరపుఖండం నిరాఘాటంగా ఆమోదిస్తుంది. ఆ ఖండవాసులతో ఈ ఖండవాసులు దేనికీ పోటీచేసి నెగ్గలేరు. ఈ ఖండం ఎప్పటికైనా బాగుపడాలంటే వారి నాగరికతకు ఒక దణ్ణంపెట్టి వర్తించడమే మార్గం ఆయినా మాటకు యితరలోకుల మాటల్లా వుండగా ఇంట్లో పెళ్ళాం బిడ్డలే చెప్పివొగ్గరు. వారు - మనకు రాజ్యం ఇచ్చి యేలుకోండని దూరంగా కూర్చున్నా - వారి నాగరికత నమీద అనుగ్రహించి దూరంగా తొలిగితేనే తప్ప మనం బాగు డం. వారికి నామకః మతమంటూ ఉన్నప్పటికీ క్షణంలో దాన్ని ళ్ళు త్యజిస్తారు. ఆచారవ్యవహారాల్లో ఉత్తరధ్రువానికీ, దక్షిణ వానికీ వున్నంత దూరంగా పైకి కనబడినా మనతోపాటు మత శ్వాసం కలవాళ్ళు మహమ్మదీయులే. నిన్న మొన్నటిదాకా రష్యాలో వుడు లేడు; నేడు మళ్ళా వున్నాడని వినవస్తూవుంది. ఎల్లుండి మళ్ళా ండడు. ఆవలెల్లుండి ఉంటాడు. "మదధీనా తవస్థితిః" అని ఎవరో చాత్యపురుషుడు దేవుణ్ణి గురించి అన్నారంటారు కాని అది యూరపు ఖండంలో చాలా కాలం నాడే అమలుజరగడానికి ఆరంభించింది. కొన్నాళ్ళు ముస్సోలినీ దేవుఁడు; అంతకంటే కూడా పెద్దదేవుడు ... హిట్లరు...గుఱ్ఱపు జట్కా-వాడు బాగానడిచే తన గుఱ్ఱాన్ని హిట్లరు పదంతోటి వాడేవాడు. మీసాన్ని గురించి చెప్పేదేమిటి! హిట్లరు అంతరించినా ఆమీసాలు కనబడుతూ ఉన్నంతకాలం అతడు ఉన్నట్లే. ఆ బీజం నశించినా ఆ మీసం నశించదు యే కాలంలోనూ నేటి భారతీయులవంటి ప్రజలు వున్నట్లే గ్రంథదృష్టాంతం కనబడదు."

—♦♦♦—

# వేదమువారి వ్యాఖ్యలు

ఈనాడు సాహిత్య జగత్తులో సామాన్యతః వినబడే మాట "కవికి శాస్త్రవైదుష్యం ఉండదని, శాస్త్రవేత్త కవి కాలేడనీ" దీనికి అపవాదభూతులైన కవులు, శాస్త్రవేత్తలు ఉండరని కాదు. సకృత్తుగా, అటువంటివారు సంభవిస్తూ ఉంటారు.

కాళిదాసు, మాఘుడు, శ్రీహర్షుడువంటి మహాప్రభువుల విషయంలో వారి సర్వతంత్ర స్వతంత్రతనుగూర్చి శంకకు అవకాశమే లేదు. ఆ వాఙ్మయంలోని రఘువంశాది నైషధాంత కావ్యాలు ఆరింటికి సంజీవనీ, ఘంటాపథ, సర్వంకషాఖ్యములైన వ్యాఖ్యలతో మహామహోపాధ్యాయుడు మల్లినాథ సూరి ఉజ్జీవనం కలుగజేశాడు. ఆంధ్రదేశ ప్రభవములైన ఆ మహావ్యాఖ్యల సహాయంతోనే ఆ సేతు శీతాచలం కాళిదాసాదుల కావ్యాలకు పఠన పాఠనాలు సాగుతున్నవి.

ఇంకా – మన తెనుగులో సాహిత్యసౌధానికి మూలబంధ ప్రాయము లనదగిన కొన్ని ప్రౌఢప్రబంధాలు గురుసన్నిధానంలో అధ్యయనించవలసిందేగాని, స్వయంవేదనకు కొరుకుపడేవి కావు. ఉత్తర హరివంశం, శృంగార నైషధం, ఆముక్తమాల్యద, పాండురంగ మాహాత్మ్యం.విజయవిలాసం. . .ఇటువంటివి కొన్ని ఆజాతిలోనివి. కడచిన శతాబ్ది చివరి చరణంలో జిజ్ఞాసువుల సౌకర్యార్థం కొన్ని ప్రౌఢ కావ్యాలపట్ల విద్వాంసులకు వ్యాచిఖ్యాస కలిగింది. కావ్యజ్ఞులైన విద్వదాచార్యులు కొందరు లోకానుగ్రహకాంక్షతో ప్రబంధాలను వ్యాఖ్యానించడానికి ఉపక్రమణం చేశారు ఆరోజుల్లో. తాదృశ వ్యాఖ్యాతృ పంక్తిలో వేదము వేంకటరాయశాస్త్రిగారంటే మళ్ళీ ఒక మల్లినాథ సూరిని తెలుగుతల్లి ప్రసాదించిందన్న మాట. ఆ తొలి

పుట్టువునకు సంస్కృత భాషా కావ్యోజ్జీవనం కారణం. ఈ మలిజన్మకు ఆంధ్రభాషా కావ్య సర్వంకష సంజీవనం హేతువు.

తెలుగు ప్రబంధం చదవడమంటే, నిఘంటు సహాకారంతో శబ్దార్థమాత్రం తెలుసుకోవడంతో పర్యాప్తమయ్యేది కాదు. గుణములు, అలంకారములు, ఔచిత్యము, ధ్వని, రసము ఇత్యాది సామగ్రి భావుకుని మహాప్రస్థానానికి చెందినది. వ్యాఖ్యాత సర్వశాస్త్ర సంప్రదాయానుసారం కవిహృదయం పట్టుకుని స్వానుభూతిసంవేద్యమైన దానిని మందాత్ములకు మాటలతో అనుగ్రహించాలి. వ్యాఖ్యాత ు కవి కల్పుడు కాకపోతే, సహృదయుని దృష్టికి ఆ వ్యాఖ్యానం ్యాఖ్యాన మయిపోతుంది. మల్లినాథుడు మాఘ కావ్య వ్యాఖ్య ్వంకష'' ఉపక్రమిస్తూ చేసిన ప్రతిజ్ఞ జ్ఞప్తికి తెచ్చుకుందాం.

''యే శబ్దార్థ పరీక్షణ ప్రణయినో యేవా గుణాలంక్రియా కౌతుకినో విహర్తు మనసో యేచ ధ్వనే రధ్వని, క్షుభ్యద్భావ ్ తే రససుధా పూరే మిమంక్షంతి యే తేషామేవ కృతే కరోమి ం మాఘస్య సర్వంకషామ్'' వేదమువారి వ్యాఖ్యానాలు కూడా ..నాథులవారి వ్యాఖ్యానియమాల ఒజ్జబంతిలో సాగినవే. అమూల మైనదీ, అనపేక్షితమైనదీ చెప్పకుండా సర్వమూ అన్వయముఖంలోనే వ్యాఖ్యానించడమనేది వేదమువారికిన్నీ వ్రతం.

శృంగారనైషధం ఆముక్తమాల్యద వంటి ప్రౌఢ ప్రబంధాలను వ్యాఖ్యానించడానికి బహుశాస్త్ర సంప్రదాయ పరిజ్ఞానమే కాక, చారిత్రకమైన పరిచయం కూడా సందర్భితం కావలసివస్తుంది. మరి, వ్రాతవడ్డ తాటాకు ప్రతులు పట్టుకుని, ఉచ్చావచంగా ఉన్న పాఠ భేదాలను ఎత్తుకొని, మూలకవికి అభిప్రేత మనుకొన్న శ్రేష్ఠ పాఠం గ్రహించడం సర్వ ప్రధానమైన విషయం వ్యాఖ్యాతకి.

విశ్వతోముఖమైన శాస్త్రవైదుష్యం, బహుభాషావేత్తృత, గాఢప్రతిభ, నిరంతరాయ వ్యవసాయం ఇత్యాది మహాలక్షణాల సమాహారం వేంకటరాయశాస్త్రిగారు ఆనాటి ఆంధ్ర విద్వల్లోకంలో "వేంకటరాయశాస్త్రిగారు చెప్పింది వేదము" అనే గౌరవం ప్రాయికం.

తొలినాళ్ళలో, శాస్త్రిగారు బిల్హణ చరిత్ర, అమరుకము, రఘువంశం, కుమారసంభవం, మేఘసందేశం, రసమంజరి, పుష్పబాణ విలాసం, ప్రియదర్శికా నాటిక, భర్తృహరి సుభాషితత్రిశతి, విక్రమార్క చరిత్ర, భోజప్రబంధము. . .ఇటువంటి ఎన్నో సంస్కృత భాషా కృతులకు సంపూర్ణ టీకా తాత్పర్యాలు వ్రాసి స్వయంగా ప్రచురించారు. వాటిని టీకలు టిప్పణాలు అనుకున్నా, వేదము వారి పరిష్కృత వ్యాఖ్యానరేఖ లవి. సంస్కృత కావ్యనాటకజ్ఞానార్థులైన తెలుగు చదువరులకు ఆంగ్లవిద్యార్థులకు ఆ టీకల మేలు నాటికి, నేటికి అమోఘమైనది.

ఇక – తెలుగులో చేమకూర వేంకటకవి సారంగధర చరిత్రము, విజయ విలాసము వేంకటరాయశాస్త్రిగారిచే వ్యాఖ్యానముద్ర వేయించుకున్న సరసకావ్య ద్వయం : వారన్నారు :

"చేమకూర చక్కెర మడిలో అమృతము పారించి పెంచినది కాని, మట్టిలో నీరు పారించి పెంచినదికాదు. ఇందు విరిమొగ్గలవోలె తావెు విడు శ్లేషలును, ద్రాక్షాపాకంబున నోరూర రసమొల్కు రచనలును, విసిగింపని వర్ణనలును, బరువు నెరువులుంగాని కబ్బంపు దొడవులును ఈ ప్రబంధములను భారతీ భాండారమందు కడు నుచ్చస్థానమున నెలకొల్పుచున్నవి."

అనేక పద్యాలలో కావ్య విద్యార్థి వ్యాఖ్యానాపేక్ష లికగి ఉంటాడు. విజయ విలాసంలోని పద్యం ఒకటి.

భ్రమరక మనోహరం బౌటఁ బద్మ మగును
తారకాహృద్య మగుట సుధానిధి యగు
రెంటి జగడాలు మోమున నంటియుంట
నబ్జముఖ యంట లెస్స యీ యలరుఁబోడి.

ఇక్కడ భ్రమరక శబ్దానికి తుమ్మెదలనీ, ముంగురులనీ రెండర్థాలు తారకా శబ్దానికి కనీనికలనీ, నక్షత్రాలనీ రెండర్థాలు. అబ్జ శబ్దానికి పద్మమనీ చంద్రుడనీ అర్థాలు. నిఘంటు సహాయంతో ఇంతమాత్రం తెలుసుకోవచ్చు. అసలు పద్యంలో స్వారస్యం అంతా ఎక్కడ ఉంది ?

"రెంటి జగడాలు మోమున నంటి యుంట" అన్నచోట ఉంది. పద్మానికీ చంద్రుడికీ జగడాలు అంటే పోరాటాలు అయి ముఖంలో అంటి ఉన్నాయి. అదేకాకుండా, వృత్తియందు అంత్యవర్ణం లోపిస్తే జగడములు అన్నది జగడాలు అనే రూపంగా అవుతుంది. అంటే గొప్పదైన కాంతి అని అర్థం ఏర్పడుతుంది. "రెంటి జగడాలు మోమున నంటియుంట" – పద్మముయొక్క చంద్రునియొక్క గొప్ప కాంతి ఆ మోములో ఉండడంవల్ల ఆమెను "అబ్జముఖి" అనడం మంచిదంటాడు అనుకున్నాంకదా ! అబ్జం అంటే పద్మమూ చంద్రుడున్నూ అర్థమేనని.

జగడాలు అన్నచోట తెలుగు పదం విరుపు మెరుపులా స్ఫురించాలి తప్ప, లేకపోతే స్వారస్యం అంతా చప్పబడి పూరకుంటుంది. అదిగో, ఇటువంటి పదాలవిరుపునే వేంకటరాయశాస్త్రిగారు "కాకి మెలకువలు" అంటారు.

గురుముఖంగానో వ్యాఖ్యానపరంగానో ఇటువంటి చమత్కారాలు ఎన్నో ఎంతటి సూక్ష్మబుద్ధికైనా గ్రహించవలసివుంటుంది. అంతా తెలిసిన తరువాత "ఇంతేనా ! వడ్లగింజలో బియ్యపుగింజ" అనిపిస్తుంది. వేదము వారి వ్యాఖ్యానాలు కావ్యార్థ స్వారస్య రహస్యాలను ప్రఖ్యాపనంచేసే ఆపణాలు వారి మహామహోపాధ్యాయత వారి,

సర్వతంత్ర స్వతంత్రతత, వారి కళాప్రపూర్ణత. తత్తద్వ్యాఖ్యలలో సర్వాంగీణమునా పరచుకొని ఉన్నది. ఆంగ్లభారతి, ఆంధ్రి, ద్రావిడి, దైవి–ఈభాషలలో పాండితీరాసిక్యాలు ఉండి జంకు కళంకు లేని కవి చంద్రులు వేంకటరాయశాస్త్రిగారు, ఆరోజుల్లో, నెల్లూరు మండల ప్రాంతాల్లో "శాస్త్రిగారు" అంటే వేదము వేంకటరాయశాస్త్రిగారే, కృష్ణాగోదావరి మండల ప్రాంతాల్లో "శా స్త్రి గా రు" అంటే చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారే. వారివారి శిష్యసహస్రసంపత్తి అటు వంటిది. వారివారి సరససంభాషణ నైపుణ్యం అటువంటిది.

వేదము వారు "కింకిణీ గణశింజాన కాంచిక" శారదకు అలంకరించి టాటోటుంగవులను పటాపంచలు చేశారు. "అముద్రిత గ్రంథ చింతామణిని" తన విమర్శ వ్యాసాలచేత మరల దీప్తిమంతంచేశారు. బహుముఖీనమైన ప్రజ్ఞాప్రాభవాలకు మూదలగా ఉన్న వేదమువారి జీవితసర్వస్వమూ కావ్యసారస్వతలోకంలో ఒక జంగమ వ్యాఖ్యాకృతి.

సాహిత్య విమర్శ వీధుల్లో ఎన్ని వాత్యాలు వీచినా నికరంగా నిలబడగలిగేవి నైషధ వ్యాఖ్య సర్వంకష ఒకటీ, ఆముక్త వ్యాఖ్య సంజీవని ఒకటీ. ఆంధ్రభాషా మధు మథనులైన వేదము వారి యశోలక్ష్మికి ఈరెండూ ధగద్ధగాయమానములైన రెండుమణికర్ణికలు. శృంగారనైషధానికి సర్వంకషవ్యాఖ్య వ్రాసి 1913 లో ప్రచురిస్తూ శాస్త్రిగారంటారు.

"వేసర కిప్డు నైషధము విప్పి నిధుల్ నెరచూర లిచ్చితిన్ జేసెదనింక దత్పరత సేవలు చూడికుడుత్తదేవికిన్" చూడికుడుత్త దేవికి సేవలు – అంటే ఆముక్తమాల్యదకు వ్యాఖ్య సంకల్పించారు. "నైషధ వ్యాఖ్య రచించడానికి, పూర్వ ముద్రణంలో రెండువేల తప్పులు దిద్దవలసి వచ్చిందని, వ్యాఖ్య రచించుటకన్న పాఠ నిర్ణయము చేసి కొనుట కడుంగడుఎక్కువ పనియైన" దంటారు.

శ్రీనాథుడు లక్షణ సేతూల్లంఘనం చేసినవాడు కాడని శాస్త్రిగారి పూర్ణవిశ్వాసం. అఖండయతులు, రేఫ రకార సాంకర్యం. క్త్వార్థేకారసంధి. కొట్టుక, తిట్టుకవంటి ప్రయోగాలు నైషధంలో ఉండవని ఆత్మవిశ్వాసానుగుణంగా వారు పూర్వ ముద్రిత గ్రంథాలను పరిశీలించి శ్రేష్ఠపాఠ నిర్ణయంచేసికొన్నారు.

పదపడి కావ్యవిమర్శకులు శాస్త్రిగారి పాఠకల్పనములను కొన్ని అర్థ నిర్ణయాలను కాదన్న వారు కొందరున్నారు. వారి ఉపపత్తులు వారివి. ఇతకు, వేదము వారు లోకోత్తర వ్యాఖ్యాన క్రతు దీక్షాపరులై శాశ్వతయశశ్శరీరులైన సారస్వత సిద్ధులు.

నైషధంలో ''దమయంతి'' హంసతో చెప్పిన సందర్భం ''అధిక రోష కషాయిత స్వాంతుఁడైన నరపతికి విన్నవింపకు నా యవస్థ పైత్య దోషోదయంబున బరుసనైన జిహ్వికకు బంచదారయు జేదుగాదె!'' పురుషుడికి పైత్యదోషం ఉద్రేకించినప్పుడు పంచదారసైతం చేదనిపిస్తుంది. అలాగే, కోపం రేగిన సమయంలో కాంతా ప్రస్తావం విరస మవుతుంది. కనుక, కుపితావస్థలో ఉన్న రాజుదగ్గర నా మాట చెప్పవద్దంటుంది – హంసతో దమయంతి.

పంచదారయు–అనుచోట సముచ్చయమైన ''యు'' శబ్దము చేత వచ్చిన ధ్వని విశేషం, వగైరా శాస్త్రిగారి వ్యాఖ్యలో చూడవచ్చు ఆముక్తవ్యాఖ్య సంజీవని 1927లో తొలిముద్రణం జరిగింది. 1913 లో నైషధ వ్యాఖ్యానంతరం చేసిన బాస ''చేసితి నిష్ఠ తత్పరత సేవలు చూడికుడుత్త దేవికిన్'' అంటూ 1927 నాటికి నెరవేర్చి తీర్ణ ప్రతిజ్ఞులయ్యారు.

ఒకవిధంగా నైషధ వ్యాఖ్యకంటె ఆముక్తమాల్యద వ్యాఖ్య క్లేశకరమైనది. నైషధానికి మూలమూ, దానికి సమర్థమైన వ్యాఖ్యలూ ఉన్నవి. ఆముక్తమాల్యద స్వతంత్ర ప్రబంధం. శాస్త్రిగారంటారు,

ఉపోద్ఘాతంలో "ఈ ప్రబంధమున ప్రౌఢియు పాండిత్యమును అలోక సామాన్యములు. ఎంతటి ప్రతిభావంతుున కేనియు దీనిని గ్రహించి వివరించుటలో గొరంతలు కలుగుట వింతకాదు."

ఈ కావ్యాన్ని వక్కాణించడానికి విశిష్టాద్వైత వాఙ్మయం నిష్కృష్టంగా తెలిసి ఉండాలి. సంగీతం, తర్కం, తంత్రం, జ్యోతిషం, ధర్మశాస్త్రస్పర్శ ఈప్రబంధానికి ఉంది. కర్మారుల కళాదుల పరిశీలనం, స్వప్నశాస్త్ర పరిజ్ఞానం ఒకటేమిటి! రాయలు "సర్వజ్ఞు" డనిపిస్తుంది. రాయలు చారిత్రక ప్రశస్తిగల సాహితీ సమరాంగణ సార్వభౌముడు. అష్టదిగ్గజకవులతో, అనేక పాలనవిషయాలతో ముడివడి ఉన్న సార్వభౌమ జీవితం అది. ఆముక్తమాల్యద – అసలు రాయల రచన యేనా, పెద్దన వ్రాసియిచ్చిందా ? అనే పరివాదం కూడా ఆనాడు ఉండేది. వేదమువారు ఆ కిల్బిషాన్ని క్షాళితంచేసి "రాయల కృతమే" అని నిర్ధారించారు.

ఆముక్తమాల్యద వ్యాఖ్యకై అజయ నిఘంటువు మొదలు హరిశ్చంద్రోపాఖ్యానం వరకూ అయిదు వందల గ్రంథాలు పరిశీలన చేసినట్లు వారిచ్చిన పట్టిక కనిపిస్తుంది. వేదము వారి వ్యాఖ్యానాలు మూల మహాకవుల నిష్కళంక యశస్సునకు ప్రఖ్యాపనాలు. ఆంధ్ర కావ్యతత్త్వ జిజ్ఞాసువులకు వేంకటరాయశాస్త్రిగారి వ్యాఖ్యాన సరస్వతి అక్షరమైన జ్యోతిష్మతి.

—♦♦♦—

# హాస్యరస తరంగిణి
# 'సాక్షి'

మన సారస్వతంలో మొన్న మొన్నటివరకు హాస్యమనేది ఆనుషంగికంగా సాగుతూ వచ్చిందే కాని, అధికారికరసం కాలేకపోయింది. శృంగార రసానికి వెనుక వెనుక ఉండి చెంగుపట్టుకుని నాటక రంగంలో మధ్యమధ్య నడవడం తప్ప, హాస్యరసం స్వతంత్ర విహారం చేసింది లేదు.

ఇటు భారతీయమైన వాఙ్మయమూ, అటు పడమటి రచయితల పోకడలూ ఆకళించుకొన్న కొందరు మేధావులు, హాస్యరసానికి దాస్య విముక్తి కలిగించి స్వతంత్ర ప్రతిపత్తిని ప్రసాదించారు. అటువంటి వారిలో పానుగంటి వారిది సువర్ణమయమైన ఒక ప్రత్యేక పీఠం. లోకోత్తర శక్తిస్ఫోరకమైన హాస్యరస ప్రకాశానికి లక్ష్మీనరసింహారావు గారి ''సాక్షి'' తిరుగులేని సాక్ష్యం.

మన ఆలంకారికులు శృంగారాది రసాలకు రంగులనూ, అధిదేవతలను నిర్వచించారు. వాటిలో హాస్యరసం ధవళవర్ణంకలది. అంటే స్వచ్ఛమైన తెల్లదనం దాని రంగు. కొంచెం ఆలోచిస్తే - మానవాంతరంగం లోని రజస్తమస్సులను దూరంచేసి సత్త్వగుణాన్ని ఉల్బణం చేసే లక్షణం ఉత్తమహాస్యరసంలో ఉన్నది. రచయిత దృష్టి ఉదాత్త లక్ష్యం కలదైతే ఉత్తమ హాస్య సృష్టి జరుగుతుంది. అన్యథా అయితే - అది అపహాస్యం.

పానుగంటి వారి హాస్యరసవాహిని రెండు పాయలు, ఒకటి సాక్షి సంబంధి. రెండవది నాటక సంబంధి. ఆయనిది నైసర్గికమైన మహాప్రతిభ. సునిశితమైన చూపు. నాటి నేటి విజ్ఞానాలలో పానుగంటి వారి మేధకు అందని సూక్ష్మాంశం లేదు. సర్వంకషమైన ఆ ప్రజ్ఞకు బహుభాషా సాహిత్యాలు, వ్యవహార ధురంధరత తోడైనవి.

లోకవృత్తంలో ఆయనది ఎంత లోతైన భావనానైశిత్యమో, ఆయన దైవవిశ్వాసం అంతకంత త్రిగుణమైనది.

సమాజంలోని గుణాగుణాలు, సదసత్తులు, మేలుగీళ్ళు వ్యంగ్య రుచిరంగా హాస్యప్రచురంగా ఎత్తిచూపి, సాంఘికమైన మాలిన్యాన్ని సంక్షాళితం చెయ్యడానికి ఎత్తిన మహోద్యమం సాక్షి. దంభాచారులు, అవినీతిపరులు, అహంకారులు, అధికార దర్పితులు - ఇట్టివారి విషయంలో సాక్షి ఉపయోగించిన కలం "కులిశం" వంటిది. కల్ల కపటాలెరుగని సాధువులకూ, స్వస్థాన వేషభాషాభిమానులకు, అక్రూర వర్తనులకు, అచ్ఛశీలురకు, సాత్త్వికులకు "సాక్షి" జీవతత్త్వాన్ని పాడి వినిపించింది. సరసమూ, మధురము అయిన హాస్యం అనుపానంగా చేసి ఆరోగ్యప్రదమైన హితౌషధాన్ని తెలుగుపాఠకులచే సేవింపజేసిన జంఘాలశాస్త్రి పానుగంటివారి అమోఘ సృష్టి.

సాక్షి సంఘంలో అయిదుగురు సభ్యులు; సభాసమావేశాలు పత్రికా ప్రకటనలూ చూచుకునే బాధ్యత సాక్షిది. జంఘాలశాస్త్రి గంటలకొలదీ ఉపన్యాసాలు యివ్వగల వాగ్ధాటీకుడు. కాలాచార్యుడు వెట్టి సభ్యుడు, పొడుముపట్టుకు ముక్కూ మొగమూ వాచినవాడు. ఈ సంఘంలో కవి వాణీదాసు. నువ్వుగింజ మీద నూరు పద్యాలు అమాంతంగా చెప్పిన దిట్ట. శ్లేష కవిత్వంలో భట్టు. ఇక - మూడవ వాడు బొర్రయసెట్టి వ్యాపారి. సాక్షి సంఘాధ్యక్షుడు.

సాక్షి సంఘం నియమావళి : "రాజకీయాలు మాటాడరాదు. వ్రాయరాదు. చెడ్డనుగూర్చి విమర్శిస్తే వ్యక్తి నామం ఉదహరించ కూడదు. తప్పనిసరి అయితే కల్పితనామం ఉపయోగించవచ్చు. సభ్యుల్లో వివాదం తటస్థిస్తే తిట్లలోకి కొట్లాటల్లోకి దిగరాదు. కర్మ వశాన, ఒకవేళ అటువంటిది సంభవిస్తే కోర్టులకెక్కరాదు.

ఇటువంటి నియమావళితో - పానుగంటివారు అపూర్వమైన, వాఙ్మయమైన ఒక సంఘాన్ని సృష్టించి మానవసంఘ సంస్కరణం చేసే ప్రయత్నం చేశారు. హాస్యరస చిత్రణంలో ఆయన వశ్యవాక్కు - సహస్రాధిక విషయ ప్రతిపాదనలు - శాస్త్రములు, దర్శనములు, మతములు, ప్రాచ్యపాశ్చాత్యరీతులు, జన్మపరంపర, వైరాగ్యము, సౌందర్యము, గర్భవతులు, గ్రహణములు, పాచక మహాసభలు, తోలుబొమ్మలాటలు, ఆయుర్వేదము, ఆంగ్లవైద్యము, న్యాయస్థానాలు ఒకటేమిటి సాక్షిచే పరామృష్టములైన విషయాలు పరస్సహస్రాలు.

ఆ వాక్యాల ఎత్తుగడలు, దింపుగడలు అక్కరలేకపోయినా గతి విశేషానికి వేసిన యతిప్రాసలు, పునరుక్తవదాభాసములు, నివేదనాలు, నవ్వింపులు, నొవ్వింపులు, గిలిగింతలు, గిల్లడాలు, ఊరడింపులు - ఆయన వచనశైలి ఒకనాటి తెలుగు పాఠకుల హృదయఫలకాలమీద ఖచితమైపోయింది.

ఎటువంటి తీవ్రవిషయమైనా శైలీపాత్రలో హాస్యరసంతో రంగరించి అందించడంలో "పానుగంటి" సర్వోత్తరుడు. నాయనలారా! అన్న సంబోధనానికి ఆయన కన్నాయన. కొన్ని ఉదాహరణాలైనా నెమరుకు తెచ్చుకుంటేనేకాని తృప్తిలేదు. జంఘాలశాస్త్రి స్వాప్నోపన్యాసం. మండల మానినీ జనసభలో సాగుతోంది.

"...బిగిమొగ్గలు కొన్ని. రవంత వికసించిన మొగ్గలు కొన్ని. సంపూర్ణముగ వికసించినవి కొన్ని, రాలిపోయిన రేకులుగలవి కొన్ని గల గులాబితోటకంటె ఆ సభ సహస్రాధిక సౌందర్య సమన్వితమై యున్నది. చెంపకొప్పులవారు, ముచ్చట ముళ్ళవారు, కత్తిరింపుల ముంగురులవారు, కాకితపుపూలవారు, కత్తిరింపు బుర్రలవారు, వాలు కన్నుల వన్నెలాడులు, గుండ్రకన్నుల కోమలాంగులు, అడుసుకన్నుల

అబలాశిరోమణులు, చింపిరికనుల శీతాంశుముఖులు, మెల్లకనుల పల్లవ పాణులు, ఒంటికంటియువిదలు,...ఓ-కర్ణాటకపు జీరలతో బుటేదారి కోకలతో-కలంకారి లంగాలతో పాముమీసపు జనానా కండువాలతో స్వదేశీయపు సెల్లాలతో మిలమిలలతో, జలజలలతో, కలకలలతో గణగణలతో, పెటపెటలతో, లొటలొటలతో వహావ్వా! సర్వజన నయనానందధురీణలై ప్రకాశించుచున్నారు. సెంట్లవాసనలు - పూవుల వాసనలు, అగరునూనె వాసనలు. - కాంతామణుల ముఖపద్మ సౌరభ ములతో గలిసియుండ నచటి వాయువంతయు మత్తెక్కి నటులున్నది. ఆడుది యున్నచోటనే అన్ని సౌరభములు! మగవాడున్నచోట నేమున్నది! పొడుము వాసన – చుట్టకంపు, సిగరెట్టు గొట్టు కంపు నేమున్నది? పురంధ్రీమణులచేతను పుష్పకములచేతనుగదా భూమి కలంకారము?" చమత్కార మేమిటంటే, వేలకొలదిగావున్న సభలో, పానుగంటివారి కటాక్షం ఏ ఒక సభ్యుణ్ణి, ఏ యొక్క సభ్యురాల్ని పలుకరించకుండా ఉండదు. ఆయన ఆధిక్షేపం సహస్రాక్షంగా ఉంటుంది, సర్వమానవానుభవ సామాన్యమైన వస్తువును ఆధారంగా చేసుకుని ఆయన కలం హాస్యరస లాస్యం చేసింది. పట్టినే నవ్వుపుట్టిం చడం - కడుపు చెక్కలు చేయడం - ఏతావన్మాత్రంకాదు. తత్త్వా భివ్యంజకమైన అర్థాగత హాస్యంలో పానుగంటికి సాటిలేడు. ఆయన అంటారు; పాచకజనమహాసభలో —

"ఇపు డాంధ్రదేశముననున్న కవులందరు వంటవాండ్రగు నెడల భరతమాత పరమానందమున తాండవించును. కవుల లెక్కేమి? నలుడు వంటలవాడై స్వరాజ్యము సంపాదించుకొన్నాడు. భీముడు వంటలవాడై స్వరాజ్యమును సంపాదించుకొన్నాడు. ఇటులే కవులెల్ల పాచకులగు నెడల స్వరాజ్యము మన కవలీలగ రాగలదు......

పాపం! స్వరాజ్యం వస్తే మన కవులకి అయిదువేళ్ళు లోపలికి పోతాయని "పానుగంటి" అనుకునేవారు. వచ్చింది. కవులు వంట చేసుకుని వేళ్ళుమింగుతున్నారు. కాదంటే - పన్నెండు సంపుటాల ఉత్తరసాక్షు లున్నారు.

పానుగంటివారి నాటకీయమైన హాస్యంకూడా పండితపామరు లకు రంజకత్వం కలిగిస్తుంది. నిజమే, విశేషము ఏమిటంటే తెలియని వాళ్ళకు శ్రోత్రఅంశాలు బోధిస్తూవాళ్ళను నవ్విస్తూ, కొంతకాలానికి "పండితులం" అనుకునేటట్టు చేస్తుంది. మేము పండితులం అనుకునే వాళ్ళను వాకట్టి శృంగభంగంచేసే ఘట్టాలు కూడా ఉన్నాయి. కంఠాభరణం, రాధాకృష్ణ, పాదుక, కోకిలవంటి నాటకాలు పాతిక ముప్పై వ్రాశారు. విశ్వరంగస్థలంమీద వినుతికెక్కిన హాస్య సన్నివేశాలు ఎన్నో!

రాధాకృష్ణలో - ప్రొద్దుట వచ్చిన ఒకణ్ణి చూచి వేరొకడు అంటాడు "ఏమిరా! శేష వర్జ్యమువలె ప్రొద్దుటనే సిద్ధమైతి" వని - ఇది జ్యోతిశ్శాస్త్ర సంబంధమైనది. వర్జ్యమంటే విడువదగినది. రాత్రి తుదిఘడియలలో ఆరంభమై ఉదయానికి ఒకటి రెండు గడియలో విఘడియలో శేషించి ఉన్నదానిని శేషవర్జ్యం అంటారు. శేష వర్జ్యం ఎలా విసర్జింపదగిందో, నీవూ అటువంటివాడవే అనడం. నర్మదా పురుకుత్సీయంలో వైద్య విదూషకుల సంభాషణ ఉంది. విదూషకుడు వైద్యుణ్ణి అడుగుతాడు! అయ్యా! తమపేరేమి?

"అమృతహస్తుడు" అంటాడు వైద్యుడు. "అయ్యా! తామె ప్పుడైనా పెరుగుతోటకూర పులుసు పుచ్చుకొన్నారా?" విదూషకు డడుగుతాడు. ఇప్పుడు దాని ప్రశంస ఎందుకు?

"మీరు వైద్యులు కనుక అడిగితిని. పెరుగుతోటకూరలోని పెరుగు ఆవు పెరుగా? గేదె పెరుగా? దాని గుణమేమి?"

వెర్రివాడా! పెరుగు తోటకూర యని విన్నంత మాత్రము ననే అందు పెరుగు కలదని ఎంచితివా?

అలాగుననా? అయ్యో! తమ అమృతహస్త నామ మట్టిదే కద! అంటాడు విదూషకుడు.

అవ్యుత్పన్నులు అసమర్థులు వేసుకున్న బిరుదములమీద పానుగంటివారి వెక్కిరింపు ఎంత సుకుమారంగా ఉందో విన్నారుకదా! కంఠాభరణంలో సుబ్బిసెట్టి షష్టిపూర్తిమహోత్సవంలో రామలక్ష్మణులు ఆశువు చెపుతారు.

''ఆశు కవిత యొకటి ఆవుపేడ యొకటి స్వయముగాగ శుద్ధ చయము భువిని, వాని కిలను వేరు పరిశోధనము కూడ దవని జెలగ వెలయ నమర విభుని.''

సుబ్బిసెట్టిని రెండు రూపాయ లిమ్మని రాముడు పద్యంలో అడుగుతాడు. లక్ష్మణుడు అప్పు డంటాడు :

'అన్నా! రెండని పల్కితేల యిలలో నన్నా! కవిత్వోరు పె
ద్దన్నా ధారుణి బుద్ధి జాతికిని హైద్రాబాదు అక్కన్నమా
దన్నా! సద్గుణ గున్న! కీర్తిభర చెన్నా! అన్న భట్రాజురా
మన్నా! మాటల మిన్న! కోపమున సున్నా! యన్న యెన్నాళ్ళకున్'

తన సమకాలంలో ఉన్న ఆశుకవిత్వాల మీద పానుగంటివారి విసుర్లు ఇలాఉన్నాయి. మొత్తము మీద ఉత్తానమైన వాచ్యత కాక, ఉదాత్తమైన వ్యంగ్యమర్యాద పానుగంటివారి హాస్యరసానికి మూల ప్రతిష్ఠ.

—♦♦♦—

# విశ్వనాథవారి వచనశైలి

వసంతునకు పుష్పపూజ. గంగాతరంగిణికి కలశాభిషేకము. ఈ కార్యము లెట్టివో ఇది యట్టిది.

తెనుగు పద్యరచనకు పూర్వాంధ్ర మహాకవులు తొంబది తొమ్మిది మార్గములు వేసియుంచిరన్నచో నేడు వానికి మరికొన్ని జోడించి శతాధికము చేసిన సమ్రాట్టు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు.

సర్వాపధీన ప్రతిభా ప్రకాశకమైన వారి పద్యశైలి అది యటు లుండె: తెనుగు వచనము వారిది అది యొక విశ్వరూపము. బహువిధ చ్ఛందో రహస్యవేత్త పలికిన వచనము వేరు. ఇతరునివచనము వేరు. దాని కది సమగ్రమైనది, ప్రత్యేకమైనది.

పదిమంది అన్యమహారచయితల వచనముతో లీనము చేయబడి నను, ఆస్వాదన వేళ స్వతోవ్యావర్తకమైన ఒకానొక విశేషముతో భాసించెడి లక్షణము గల శైలి అది.

లక్షమందిలో ఉన్నను, ఆ శైలీపురుషుని ఇట్టే పట్టివేయ వచ్చును. తెనుగు వాక్యరచన విశ్వనాథవారి చేతిలో ఉచ్చావచ విన్యాసములు నేర్చుకొన్నది. ఎన్ని సొగసులు! ఎన్ని మలుపులు!

ఆ వచనము చదువరిని మహానదు లీదించును. శైలాధిరోహ ణము చేయించును. దుర్గమారణ్యములందలి పులులతో, సింహములతో, ఆభీలమైన ఆఖేటక వినోదము లాడించును, అంతలో రాజహంసలకు నడలునేర్పును. మత్తమయూరములకు నృత్యోపదేశము చేయును,

ఒకటా ? రెండా ? విశ్వనాథవారి వచనము లక్షాధికమైన పుటలలోనున్నదికదా ! ఒకచోట చెప్పబడిన విషయము, చేయబడిన వర్ణనము మరల మరల ప్రసక్తము కావచ్చును. ఏమో కాని, ఆశైలీ వైభవము పౌనరుక్త్యమును మన తలంపునకు రానీయదు. ఆవాక్యముల పలుకుబడిలో అట్టి మంత్రమున్నది. ఎక్కడికక్కడ ఆ వచనము మొలచినటులుండును.

తెనుగు భారతములోని నన్నయ తిక్కనల వచనము లున్నవి. ప్రబంధాంతర్గత వచనము లున్నవి. చిన్నయసూరి మున్నగు వారి ప్రత్యేక వచనములును ఉన్నవి. కందుకూరివారు, చిలకమర్తివారు, కేతవరపువారు, వేంకటపార్వతీశ్వర కవులు, అడివి బాపిరాజుగారు, ఉన్నవవారు, నోరివారు వీరందరు నవలలు వ్రాసినవారు. పుంఖానుపుంఖాలుగా వ్యావహారిక వచనములును వచ్చుచున్నవి,

పెద్దలందరికి శైలీప్రత్యేకత ఉండనేయుండును. అది యటులుండగా ఒక ప్రత్యగ్రత విశ్వనాథవారి శైలిలో అనిర్వచనీయమైనది సహృదయుడు అనుభవింప గలుగుచున్నాడు. తదనంతర కాలికమైన సలక్షణాంధ్ర వచనశైలుల కెన్నింటికో అది మార్గజ్యోతి యగుచున్నది ! ఇది మున్నే చెప్పవలసినమాట :

విశ్వనాథవారి వచనశైలి ప్రధానముగా త్రిపథగ. ఒకటి - ఏకవీర, వేయిపడగలు మున్నగు పెక్కు నవలలకు చెందినది. రెండు-అభిజ్ఞాన శాకుంతలము, నన్నయగారి ప్రసన్న కథాకలితార్థయుక్తి మున్నగు సాహిత్య విమర్శన గ్రంథ సంబంధి. మూడు-రామాయణ కల్పవృక్ష మహాకావ్యాంతర్గతము. మరి ఎన్నో వారి చిన్నకథలు, వ్యాసములు, నాటకములలోని వచనములు పయివానిలో అంతర్భవించునవే.

ఆమూఁటియందును అంతః ప్రవాహినిగా ఒకానొక విశ్వనాథ సాహితీశైలి యున్న దన్నది భావకుని యనుభవములోనిది.

శరవేగముతో కొన్ని వామన వాక్యములు. అంతలో నొక భూమవాక్యము. ఏకశబ్ద వాక్యములు, దీర్ఘ దీర్ఘ సమాస నిశ్శ్రేణికలు. సమాసపదవభాస వ్యాస వాక్యములు: ఒకరకము కాదు. ప్రతి వాక్యము తన్ముద్రా ముద్రితమైనట్లే నడపించును. పట్టి చికిలిచేయుట, నగిషిచెక్కుట కర్తృకర్మక్రియాదికములను గుంజిగుంజి నిర్బంధించుట ఈ విధమైన కర్మకాండము ఆ వచనమునకు లేదు. అది నిత్యవేగి. ఎంత వేగమో అంత సత్త్వము, ఎంతసత్త్వమో అంత గంభీరత. ఆశైలితో పాఠకుడు పాతాళపు లోతులను త్రవ్వకొనును, ఆశైలి చదువరికి రెక్కలుకట్టును. హృదయమునకు పదనుపెట్టును. చిత్తగింపుడు. "ఆయావు సొగసు! అది కుండంత పొదుగుతో నిగనిగలాడు మేనితో గుజ్జురూపుతో విదియనాటి చందురుని శృంగముల వంటి మెడలో దృష్టి త్రాడుతో నడవులకు మేతకై పోవునపుడుగాని వచ్చునపుడుగాని జనములకు దానిమీద జూపే చూపు..."

ఈ రచన యెడుపు అటులున్నది!

మరియొకజాతి!

"గ్రుడ్డివాని చేతిరాయి, తగిలిన తగులును. తగులదును." ఇది మూఁడు వాక్యముల రచన. చిత్రమైనది. మొదటిది మూఁడు పదములతోడి సమాసము, రెండవదానిలో రెండు పదములు. మూఁడవ దానిలో ఒక క్రియాపదము ఇవి మూఁడును విడివిడిగా వాక్య ధర్మముల కలిగినవి. "గ్రుడ్డివాని చేతిరాయి తగిలితే తగులుతుంది లేకపోతే లేదు" అన్న లోకవ్యవహారమునకు ఎంత కావ్యభాషా ప్రౌఢిమ వచ్చినదో చూడుడు. "తగులదును" అనుచోటి ప్రయోగ వ్యాకరణము విశ్వనాథోపజ్ఞము.

నవలలో వర్ణన ఘట్టము వచ్చినపుడు విశ్వనాథవారి ఓజో భూయిష్ఠ రచన మయూర పింఛము

"అష్టమినాడు ప్రొద్దుక్రుంకినంతనే వెన్నెలలు సితమత్స్య పుచ్ఛరోచులు వెల్లిగ్రక్కెను. అపహరింపబడిన వేదముల కాంతులు మరల బ్రహ్మాదత్తములైనవేళ వికసించినట్లు తన ధర్మములు నాల్గు మూలల వెదచల్లినట్లు తద్గత సరస్వతీ సిత శరీర లావణ్యాచ్ఛవిపూరము దిగంతము లందుకొన్నట్లు సరస్వతీ శిరఃప్రదేశ లాంఛనీకృత చంద్రమః ఖండ వినిర్గత కాంతిపూరము వెల్లివిరిసినట్లు, వెన్నెలలు వర్షా సౌదామినీ పిశంగచ్ఛటా సుందరములై కొన్ని యెడల సితాసితచ్ఛటా ఘటా సటాజాలంబులు విరిసి యొక్కచోట హిమానీబిందు సద్వంశ ముక్తాహార హీర కాంతి పూరాభిరామంబులై యొక్కచోట..."

ఇది యొక ప్రబంధ వచన ఫణితి.

ఒకొక్కచోట ఆయన వచనశైలి చదువరికి పారము చెప్పును. "ఆ కనులమీద కనుబొమలు చిట్టీత పొదలు. మీసములు నల్లని రావణాసురుని మీసములు. రావణాసురుని మీసము లనగా కొన్ని సముద్రతీరములందు వెదురుజాతిది. నేలమీద ప్రాకెడునది. సన్నని మట్టలవంటి యాకులగలది ఆ మట్టల చివుళ్ళు సూదులుగా నుండునది యొక కంపయుండును. అది నేలమీద ప్రాకును. దానిని రావణాసురుని మీసములందురు."

రావణాసురుని మీసములనఁగా మన కర్థముకాదు చెప్పవల యును. ఒక నిఘంటుకారుడో, విజ్ఞానసర్వస్వకారుడో చేసినట్లు నవలలో ఇక్కడ దాని కర్థ వివరణము చేయుట అపూర్వమైన పద్ధతి.

ఇక, విశ్వనాథవారి సాహిత్యవిమర్శనములలోని వచనశైలి తనకుఁదాను ప్రసిద్ధమైనది.

"నన్నయగారు కథయొక్క ఆయువు పట్టుకొని దానిని ప్రసన్నము చేయుటకే ప్రయత్నించును. కథాంశములయందెక్కడో అక్కడ నొక చమత్కార సన్నివేశ ముండవచ్చును. తదపేక్షయా ప్రధానార్థ విషయము భంగించదు. అంగవిషయము అంగిని ప్రమింగదు. ప్రమింగినచో రసభంగము."

ఈ శైలికి ఒరవడి సంస్కృతభాషలోని ఆయా భాష్యకారుల రచనలు కావలయును. కొన్ని ప్రశ్నలు వేసికొనుట వానికి సమాధానములు చెప్పుట ఇది విశ్వనాథవారి సాహిత్య విమర్శనములలో హృద్యమైన విధానము.

1. ఋష్యశృంగుని కథ ఎందరకు తెలియును ?

2. ఈ కథలోని పరమార్థమేమి ?

3. తపస్సనగా నేమి ?

4. మహర్షులనగా నెట్టివారు ?

5. ఇది నిజముగా నలచరిత్రమా ? దమయంతీ చరిత్రమా ?

6. సామాన్యముగా భారతదేశ రాజసభ లెట్లుండును ? ఆ సభాస్థానవైఖరి యెట్టిది ?

7. భాషయొక్క ఆయువుపట్టు ఎచ్చట నుండును ?

ప్రశ్న పరంపర యిటులుండును. పదపడి ప్రత్యుత్తరము లుండును. ప్రశ్న ప్రత్యుత్తర వచనశైలి దానికది దీటు.

సాహిత్య విమర్శనము చేసినవారిలో చేయుచున్నవారిలో పెద్దలున్నారు స్వర్గీయ కట్టమంచి రామలింగారెడ్డిగారు, వేలూరి శివరామశాస్త్రిగారు, రాళ్ళపల్లివారు, పింగళివారు ప్రసిద్ధులు. సాహిత్య వచనములో వారు శైలీసనాథులు. విశ్వనాథవారి శైలికి పెరపోలిక లేదు.

ఇక, రామాయణ కల్పవృక్షములోని పద్యముల నడిమి వచనములు. దానినిగూర్చి ఒక మాట.

సంస్కృత కావ్యముల విషయము కాదు. తెనుగు సారస్వతమున చంపూ పద్ధతికి వచ్చిన రాణింపు నిర్వచనమునకు లేదు. నాడు తిక్కనగారొక్కరు దీని కపవాదము కావచ్చు.

కావ్యగతమైన పద్య చ్ఛందస్సు తాను తనవెంట లోతులకు గొనిపోయి భావకహృదయమును లోవెలుగు వెల్లువలో మూటకట్టి ముంచు సామర్థ్యము కలది. మరి వచనము! ఆ వెల్లువయొక్క వెలి వెలుగు. ఈ రెండింటి సంబంధము అనాది. ఈ రెంట, దేనిని గెంట జూచినను సాహిత్యమునకు సాహిత్యధర్మము చెడిపోవును. శ్రీమద్రామాయణ కల్పవృక్షము అవిచ్ఛిన్నమైన ఆంధ్రసారస్వత చంపూ సంప్రదాయవల్లికి ప్రాకుడు గొమ్మయైనది. అందలి విశ్వనాథ వారి వచనశైలి వేయినోళ్ళతో చెప్పదగినది.



# నేఁటి పద్యరచన భవితవ్యము

జ్యోతిష్మంతములైన ఆంధ్రసారస్వత మహాపురుషుని లోచనములలో ఒకటి గద్యము; వేఱొకటి పద్యము. గద్యము కాంతి లక్షణముకలది పద్యము క్రాంతికక్షము. ఇది - మన వాఙ్మయాకాశమున యోగపద్యమైన ఒక పుష్పవద్యోగము. శతాబ్దులుగా అహోరాత్రములు కలుపుకొని వచ్చుచున్న దీప్తిభోగము.

గద్య పద్య విన్యాసములతో సర్వాంధ్రవిషయమున పాఠకులకు భావుకులకు నయనోన్మేషము కలిగించినది వెయ్యేండ్లమాట! పద్యమును విద్యగా భావించి అధ్యయనించుట - మహాకవిత్వ దీక్షావిధిలో పద్యమునకు అభ్యర్హితత్వము పాటించుట - తెలుగువారి ఛందఃప్రస్థానమునకు ఈ రెండును మున్ముందుగా అందిన నాందీవాదములు.

రసామ్నాయమైన కవిత్రయమువారి సంహితారచనానుభావము తెలుఁగులో ఉత్తరోత్తర యుగములకు మెఱవడియగుచుండుట ఎంత కాదన్నను అనుభవ పరిచితము.

గణములు - యతిప్రాసములు - ఇట్లు ఛందోనియతమైనదానికి "పద్యము" అన్న వ్యవహారము. పద్య చ్ఛందస్సులకు గల సంబంధము వ్యాప్య వ్యాపకము; కార్య కారణము. కార్యమునకు కారణ గుణ సంక్రమణము తప్పనిది.

శబ్దముయొక్క పుట్టుకనుబట్టి చూడగా, ఛందస్సు ఆచ్ఛాదనము కలిగించునది! ఆహ్లాదము నొదవించునది. ఆచ్ఛాదము ప్రాణశక్తిప్రదము. ఆహ్లాదము జీవరక్తిదాయకము. అట్టి ఛందోధర్మమును అమర్యాదపఱచని ఒకానొక వినయలక్షణము పద్యమున ఒదిగియున్నది.

మఱియొకటి: కవి ఒక భావమును బహిర్గతము చేయుటకు ఉద్దేశించెను. తదభివ్యక్తికి శబ్దము ఉండవలెను. ఉన్న శబ్దమే వైఖరీదశకు రావలెను. ఈ స్థితిలో ఇటు లనుకొందము. ఆ శబ్ద శైలూషి మనోజ్ఞమైన జిలుగువలువతో జిహ్వాగ్రరంగమున అడుగుపెట్టినది. ఆ ప్రవేశ వైఖరిలో శ్రుతిప్రియమైన సుధాప్రాయమైన లయరాగములు శ్రోతృచేతస్సును వలవైచి లాగుచున్నవి. అపుడు - కవియొక్క ఉద్దిష్ట భావము సహృదయునిలో చరితార్థమగుట జరుగుచున్నది. ఈ సందర్భమున శబ్దసుందరిచే రంగప్రవేశము చేయించిన సూత్రధార స్థానము ఛందస్సుది. పద్య స్వాతంత్ర్యమునకు ఛందస్సు బంధకము కాదు, పయిగా, తద్గతి గీతిసౌందర్య సంధాయకము.

పురా విమర్శక పరామృష్టము ఛందోరుచిరమునైన నాటి పద్య రచనను గూర్చి కాదు చెప్పవలసినది.

పరిషత్తుచే అనుగృహీతమై నాపాలికివచ్చిన భాగధేయాంశము నేటి పద్య రచన - దాని భవితవ్యము. ఈ ప్రసంగమునకు ముందు ఇందాక, చొఱవచేసి వెలువఱిచిన నాల్గుమాటలు నాకు నేను వేసికొన్న పూర్వ పీఠిక.

అభిజ్ఞుల సపర్యాపర్యవేక్షణములతో "అకాడమీ" ఇరువదేండ్ల వయస్సునకు వచ్చిన అభిస్ఫురిత సమయము. ఈ రెండు దశలలో మన పద్యరచనలు పాఠకుని సహృదయుని చిత్తరంగమును ఎట్లు రసభావతరంగితము చేయగలిగినవి! యథాస్మృతికము చెప్పుకోవలసిన తరుణము.

రచన యనగా నిర్మాణము. పన్నుగడ. ఇది-ప్రతిభ, వ్యుత్పత్తి, సౌందర్యము, శిల్పము ఇత్యాది బహు మనోహరార్థ పరిస్ఫోరకమైన శబ్దము - రచనయే కావ్యము. పద్యరచన పద్యకావ్యము.

సరిగా ఇరువదియెన్మిదేండ్లనాడు ప్రథమాస్థానకవిపట్టోత్సవ సమయమున విజయవాడనుండి వినిపించిన మాటలు.

"యతియున్ బ్రాసయుఁగూర్చు మాత్ర కవియే! యంచేను వాకొంటి గీ
రతమన్ గావ్యమునందు, నా రచన లారాధ్యమ్ములే యైన నే
కతమో తెల్పుఁడు సంతసింతు; గణసంఘాతంబు కావ్యంబె?.... "

అని ప్రశ్నించి, " ఆతఁడనేక యుద్ధముల నారియుఁదేఱిన వృద్ధమూర్తి" చెప్పిన పద్యములు.

క. బుధులకు " సాధ్యోహి రసో
యథాతథ" మ్మనెడి వాక్య మర్థమ్మగు; వా
రధమ మని పరిహరింతురు
వృథాగఁ గష్టించినట్టి వేత్తల రచనల్

గీ. కవితవలనఁ బున్నెముగూడఁ గలిగెనేని
గలుగనిం డాఁప శక్యమ్ము గాదు; రామ
కోటివలె నుండు రచనలు కోవిదులకు
నచ్చ, వీరహాస్యమ్ము విన్నాణి యెఱుఁగు.

ఇది - ఈ శతాబ్ది నడిబొడ్డు నుండి (1950) వీచిన పద్మగంధిలమైన సాహిత్య వాచికము. యతిప్రాసములు - గణసంఘాతము - ఈ ఛాందసము రసమునకు ఉపస్కారకమగునేకాని, ఉపాలంభకము కాదనుట యిక్కడి యుద్దేశ్యము, కవియొక్క నిర్మాణశక్తివలన కావ్యమునకు రసవత్తరత ! ఆశక్తి యెక్కువ తక్కువలు కావ్యములను బహుధాకరించుచున్నవి. యుగయుగములందును ఈ తారతమ్యములు, ఈ రమ్యతారమ్యతలు ఇట్లే ఉండక తప్పదు. కాలము గడచిన కొలఁది- సహృదయ సమీక్షులు జల్లెడలై తేలిన రచనలేవో అవి మనకు దక్కినవి. "ద్విత్రాః పంచషావా గణ్యంతే కవయః"

ఒక కాలములోని రచనలు తీసికొన్నచో, వానికి తత్పూర్వ కాలిక కృతిచ్ఛాయలు దళముగనో పలుచగనో పడుట విధి. ఇది సృష్టియందలి ధారారసలక్షణము. దీనిని త్రెంపజూచుట నిష్ఫల ప్రయత్నము. ఒకప్పుడు-ఒకానొక బలమైన పారిప్లవవాయు విజృంభణ ముతో ఆ ధార తెగినజాడ తోచవచ్చును. "అయ్యో! సంప్రదాయము సంప్రదాయము"-అని ఇవతలివాడు కూయిపెట్టును.

"అవే పదములు. అవే అర్థములు. కూర్పు నేర్పును బట్టి కావ్యము నవ్యము"-అన్న అభిజ్ఞవాణి యొకటి మనము విన్నదే. ఇక్కడి తచ్ఛబ్దము సంప్రదాయార్థకము. పద పదార్థముల సంబంధము పార్వతీ పరమేశ్వరులవలె సంపృక్తమైనది. ఈ సంబంధము ఎడము గాకుండగా చేయు ప్రయత్న కౌశలమునుండి రసోత్పత్తి యగు చున్నది. ఏతాదృశమైన గ్రథన చాతుర్యము లేని రచనలో ప్రత్యగ్రత లేదు. స్వాచ్ఛందమైన కూర్పు నేర్పునకు ఛందస్సు-పద్యము-ఉద్దీపకము.

"సాధ్యో హి రసో యథాతథం కవిభిః"-శరత్సహస్రము నాటి మాట-మొన్నటి చెళ్ళపిళ్ళ శతావధాని నోట అనుగర్జితమైనది. నిన్నటి కవిసమ్రాట్టు "వ్యాఖ్యాన సింహాసనము" కూడ ఆ సిద్ధాంత మునకే అనుగీతము :

"కవిప్రతిభలోన నుండును గావ్య గత శ
తాంశములయందుఁ దొంబది యైన పాళ్ళు
ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథాదృతిని మించి."

మఱి - నేడు 1958-1978 నడిమి దశాబ్దులలోని పద్యరచన లను ఆశాజ్యోతులు కొన్ని సముజ్జ్వలములు.

ఈ శతాబ్ది పూర్వార్ధములోనే రామాయణ బీజనిర్గతమైన కల్పవృక్షమునకు ఫలగ్రంథము యుద్ధకాండము 1962 లో ఆంధ్ర సరస్వతికి నైవేద్యమగుట మనము చూచితిమి. తెలుగులో నేటి పద్య రచనా విజయమునకు శ్రీమత్ప్రతిష్ఠ జ్ఞానపీఠ బహూకరణము. సంప్రదాయ కవిత్వమునకు సలక్షణ సరస్వతికి ఆధునిక యుగమున రామాయణ కల్పవృక్షముతో అక్షర లక్షలు లభించినవి. భావుకులు ఈ లాభమును వదలుకొనుట సిరిరా మోకాలొడ్డుట. పూర్వమహాకవుల సంప్రదాయముపై ఉపేక్ష-క్రొత్తపోకడలమీాద వల్లమాలిన అపేక్ష-అట్టి సంధ్యాఖండములో అద్యతన కాలమున నేనుంటి నని సేతు బంధము చేసిచూపిన సర్గబంధము; రససింధువు కల్పవృక్షము. శ్రీరామ చంద్ర దర్శనము చేసి నలుఁడు సముద్రతీరమున చెప్పినది.

చ. మనపని తీరినన్ జలధి మంధర గర్భ మహాపయో నిబం
ధనమున శ్రద్ధయున్ సడలినన్ యుగముల్ భవదీయసేతు బం
ధనకృత చిహ్నముల్ చెడవు నా రచనాపటుశిల్పపాటవం
బనితరమై త్రికాలనిబిడాచ్ఛయశోనవమూర్తి మత్ప్రభూ :

కల్పవృక్షము శాంతరసాధ్యక్షముగా సంతరింపబడిన మహా కావ్యము. తెలుఁగులో పోతనగారి భాగవతము ఎట్లు భావభూమియో. అట్టి ప్రయత్న సిద్ధులు రామాయణ కల్పవృక్షమున భావించినవారికి తోచవచ్చును. విశ్వనాథవారి పద్యములో లఘురచనలును ప్రద్యుమ్నాభ్యుదయము. శివార్పణము, మధ్యాక్కఱలు వంటివి పెక్కులు వచ్చినవి. అవియెల్ల రామాయణము పై చిలుకులు.

"నాకవిత్వ మనుపేర నిప్పటికి శివభారతము చాలు" నను కొన్న గడియారము వారి కలము 1973లో "రఘునాథీయము" అను మఱియొక అద్వితీయ కావ్యమును వెలువడఁజేసినది. "శాస్త్రిగారిది పుటలు నించి సంపుటములను పేర్చి ప్రదర్శించు ఆశు రచనా

ధోరణికాక, చిక్కగా చిలికి పిండి పైకెత్తి అర్థభావముల నావిష్కరించు ప్రశాంతభావుక కవితానుబంధ" అనిచెప్పిన అనంతకృష్ణ శర్మగారి ప్రవచన మొకటి చరిత్రకావ్యకారులకు జ్ఞప్తి. "కవులు ప్రపంచించునది ఆధ్యాత్మిక సత్యమే కాని ఆధిభౌతిక సత్యము కాదనుట మహాకవులు నాడును-నేడును-రేపును గమనించి ఆచరించు ధర్మము. ఆదారిలో ఉదాత్తభావములను తేజోవంతముగా వెలువరిచి ప్రజలఅంతఃకరణములను సంస్కరించుటయే కావ్యకామనీయకమునకు పరమ ఫలము."

గడియారమువారిది "నూతనమున్ ప్రాగ్గుణసమ్మితమ్ము" నైన పద్య రచనా రీతి. శివభారతమునకు "రఘునాధీయము" తోడు నీడగా వచ్చినది. కావ్యకర్త ఆశంసనము ఇట్లున్నది

చ. అమలిన సారభావ్వితములై విలసిల్లిన రెండువేల ప
ద్యములఁ దనర్చు నీకుసుమహారము శ్రీరఘునాధుకీర్తి హా
రముగ ఘటించి, యాంధ్రజన రమ్యరసజ్ఞత నెన్నుచున్ గృతా
ర్థముగఁ దలంతుఁ; బ్రాజ్ఞులు శుభమ్ముగ దీన గ్రహింత్రుగావుతన్.

మన కవుల దృష్టి మహారాష్ట్రాదులవైపు ప్రసరించుట చాలఁగాలము క్రితమే చూచితిమి. ఈ నడుమ జాతిరత్నములను ఎన్నుకొనుటలోని వారి చూపులో గుప్తమైన మలుపు సహృదయులు గమనించుచునే యుందురు.

ఈ శతాబ్ది యుదయమునుండి ఉదయించిన తుమ్మల సీతారామమూర్తిగారి కృతహస్తము మన కిచ్చిన "మహాత్మకథ" జాతిప్రశస్తమైన తెనుఁగు కబ్బము. గాంధి మహాత్ముని 'ఆత్మకథ' పద్యరూపమునఁ దీర్చబడినది 1951లో దానికి తిలక రచన చేసిన కట్టమంచి రామలింగారెడ్డి "సీతారామమూర్తి మహాత్ముని ఆస్థానకవి. ఆ స్థానము శాశ్వతము" అనుట మనము విన్నమాట. నాటి ఆత్మకథ తరువాత,

పదేండ్లనాఁడు వెలువడిన "మహాత్మకథ" ఆయన కృతులలో స్వాధీన పతిక. సంప్రదాయసిద్ధమయిన భాష, స్వస్థాన వేషభాషాభిరతి, రాష్ట్ర గానముచే హృదయరంజనము చేసిన కమ్మని తెనుఁగు గొంతు. ఆత్మ విశ్వాసము గల ధీరవాక్కు.

చేసిన పుణ్యమై తనకుఁ జిక్కినకైత ఫలింప భక్తిమై
వ్రాసినవాఁడఁ దొల్లి యెరవాఁడ తపస్వి కృతంబు సూనృత
శ్రీసము పేత మాత్మకథ శిష్టజన స్తవనీయ భారతీ
భాసుర గద్య పద్య పరిపాటికి మూదలయై తలిర్పఁగన్.

"ఆత్మకథ" కంటె "మహాత్మకథ" కవికి రచనాస్వాతంత్ర్యము నధికముగా నిచ్చిన గ్రంధము.

గాంధియుగమునఁ బుట్టితి గాంధి నడుపు
నుద్యమంబుల నలఁగితి నోపినంత
గాంధి నీక్షించితిని గాంధి కవిత వ్రాయ
గంటి నీజన్మమ నకు నీపంట చాలు."

ఎక్కడ కక్కడ - చాలు నన్న తృప్తి పడుచున్నను సరియైన కవి ఊరకుండజాలడు. సీతారామమూర్తిగారు సర్వోదయగానము - పైరపంట-ఎక్కట్లు-మున్నగు చిట్టి కబ్బములు వెలువరించి వచ్చుచునే యున్నారు. 1973లో "నా కథలు" తెనుఁగులెంక కృతి వచ్చినది. ఇది ఒక విధముగా పద్యములలో స్వీయచరిత్ర. ఆయన శీలమున కిది దర్పణము. ఆయన సత్యారాధనకు అద్దము. దేశీయచ్ఛందములు సీతా రామమూర్తిగారి చేతిలో సుందరచ్ఛాయలుగా చిత్రితములైనవి. కొందఱు గుదిబండ యనుకొను ఛందస్సు ఆయనకు నల్లేరుపై బండినడక ఇక్కడ రామలింగారెడ్డిగారి మాటలే పునశ్చరణము చేసికొనుటలో పద్యరచన యెడల అయన యభిప్రాయముకూడ తెలిసి కొనుటయగును.

"మన చౌదరిగారు యతిప్రాసములకై భంగపాటుచెంది తల గోఁకికొనుచు బలాత్కార పదప్రయోగములు చేసి, యర్థము ననుసరించి పదములు వాడక, పదములఁబట్టి యర్థమును వంపులువెట్టి వంగఁజేయు నీరసుఁడు కాఁడు. భావ మనర్గళముగాఁ బ్రవహించు చందాన వ్రాయు మహనీయుఁడు. యతి పదాదియందే కాక మధ్యమునను గొనలు వ్రాలును. ప్రాసమునకు యతికిని పద్యము నడక నిలిచి దాఁటవలసిన యిబ్బంది లేదు. అర్థమునుబట్టి పదములు, పదములలో లీనమైన రీతిని యతిప్రాసములు అనాయాసముగ నప్రయత్నముగ స్వచ్ఛందముగ వచ్చి చేరుచుండును. ఈ సిద్ధియందు ప్రసిద్ధుఁడు తిక్కన. ఈ వర్గమున తిక్కనతో సజాతీయుఁడైనవాఁడు మన చౌదరి."

ఇందాఁక ఎందుకు ఉదాహరించితిననగా, ఆంధ్ర కవిత్వ తత్త్వమును లోఁతుగా విచారణము చేసిన శ్రీ కట్టమంచి రెడ్డిగారి ఛందోగౌరవ మేతాదృశ మనుటకు.

తరువాత 1966లో 'పోతన' అను మహాకావ్యము తెలంగాణా ప్రాంతము ప్రసాదించిన పెన్నిధి. వానమామలై వరదాచార్యుల వారు ఉభయభాషలయందు సభాజనపాత్రమైన వైదుష్యముగల కవి. దేశకాల పాత్రములను గుర్తించుటలో ఆయన మేధ సునిశితమైనది. చిఱుతిండ్లకు ఉబలాటపడక, మృష్టాన్నభోజనముచేసి, అతిధులచే నైతము చేయింపగల జరరపుష్టిగల శిష్టులలో ఆయన ఒకరు. చరిత్ర సిద్ధులగు మహాపురుషులను కావ్యపాత్రములుగా చేయుచున్న ఈ కాలములో, కావ్యమయ వపుర్విఖ్యాత దివ్యసుందరమూర్తియైన "పోతన" చరిత్రమును కయికొని వ్రాయుటతో ఈ గ్రంథము చెప్పక చెప్పు మహాకావ్యమైనది. ఈ ప్రబంధ నిర్మాణములో ఆచార్యులవారి కథాకల్పనము, వర్ణనప్రావీణ్యము, భావనావైభవము కీర్తనీయములు. ప్రాక్తన కవులు పోతన శ్రీనాథాదుల కైత పోలికలు, ఆధునికులు

సమకాలికులునగు కవుల పోకడలు ఈ కావ్యమునందు రోక్కారోక్కములుగాఁ గనిపించుచున్నను, శ్రీ వరదాచార్యులవారిదైన యొక శైలీముద్ర సర్వత్ర భద్రమై యున్నది. పోతన చరిత్రము ముందు పీఠికగా నున్న పద్యములు ఆచార్యులవారి అనసూయము అవ్యాజము అమృతప్రాయమునైన హృదయమునకు అనుబింబములు. సంస్కృతాంధ్రకవులస్తుతి – ఆధునికకవిస్తుతి – నవ్యకవిస్తుతి – తెలంగాణ పండితకవిస్తుతి, సకలకవిస్తుతి – చేసిన పద్ధతి అపూర్వము.

మఱచినట్టి సత్కవులకు మది నొకింత
గుఱుతులేని సత్కవులకుఁ గొంచె మింక
చిఱుతలైన సత్కవులకు ధరణిఁ బుట్టు
వొందఁబోవు సత్కవులకు వందనములు.

అకృతకమైన సంప్రదాయాభిరతి యిట్లుండును గాఁబోలు! వర్ణనాపూర్ణమైన యిట్టి మహాకావ్యము రచించుటకుఁ దగిన మేధా సమాధి యీనాఁడు క్వాచిత్కము. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు అన్నారు. "ఈయనది గాఢమైన శక్తి – మహా గట్టి దీక్ష. సంపన్నమైన కల్పన అవి లేకపోతే ఈరోజులలో ఇట్టి కావ్యాన్ని రచించగలగడం ఎలాగ ? అసామాన్యమైన ఆవేశం ఈయనను ఆవహించి ఉండాలి."

చారిత్రకమైన యితివృత్తము కయికొని బృహత్కావ్యరచన చేయుట యన్నది ఈ శతాబ్ది పూర్వార్థములోనే మొగ్గదొడిగినట్లు కనిపించి ఉత్తరార్థమున రేకులు విప్పినది. "పద్యముల రాశి కాదు, కావలసినది వాసి" యన్నవాద మొకటి యున్నది. "వాసిగల రాశి"ని సృష్టించిన కవుల విషయమున ఈ వాదము పరాస్తము కాక తప్పదు. ముప్పదియేండ్ల క్రిందట మన తెనుఁగులో మన కవులు పద్యరచనలో ఒయ్యారములు ఎన్నో సంపన్నములు చేసిరి. నైకవిధములు త్రోవలు తీసిరి. ఆత్మనాయకములైన మధుర కవితలు, దేశభక్తి పరములు;

బౌద్ధ సంబంధులు జాతీయతాస్ఫోరకములు, చరిత్ర ప్రతీతములు. కృషీవలాద్యుత్కర్ష కములు.

ఈ రెండు దశాబ్దులలో ఇట్టి మార్గము లన్నింటి వెంట "పద్యము" కవులు నడపించుచునే యున్నారు, ఇది ఇట్లు తనదారిఁ బడి తాను సాగుచుండగా కొందఱు దీనిమీఁద ఱాలు విసరుచున్నారు. ఇప్పుడే కాదు. ముప్పదేండ్ల క్రితమే దానికి బొప్పికట్టినట్లు "జాషువా" కవి మత్తేభము సాక్ష్యము చెప్పాను :

"కవితావాహిని చీలి, పాయలయి యాగంబై యథేచ్ఛారతిన్
ప్రబహింపం దొడఁగెన్ బురాతనపుద్రోవల్ పుంతలున్ బాడువ
డ్డవి, ఛందోనియమాదికూలములు భ్రష్టంబయ్యె నీమందువే
సవియం దింకునొ!సంగమించునొ! రసస్వర్గీయ పాథోనిధిన్."

కవితావాహినికి ఛందోనియమములు కూలములఁట! ఎంత అనుకూల సరసమైన మాట! పద్యరచనాసరణిలో కూలంకష ప్రతిభుఁడైన ఆ కవి ఛందోనువర్తనము మఱవనివారు కొందఱుండకపోరు. నేటి కవితాలోకమున సర్వ పథీనుడుగా ప్రసిద్ధినందిన సాహిత్యవేత్త "మాస్వామి" అన్నమాట సంప్రదాయపు బాటలో సాగుచున్నవారికి జ్ఞప్తియుండును.

నినుఁ గ్రొంగ్రొత్తలు తేర్చు గుంఫనల వ
ర్ణింపంగ నూహింతు నా
నని యేదారిన బోయి పూర్వకవి పా
దాంకంబులే తోఁచి లో
నన లజ్జాపరిగూఢమానసుఁడనై
నాలోన నేనే వినూ
తనశంకాహృదయుండ నాదు మఱి
తుంతవ్యుండ విశ్వేశ్వరా!

ఇది యిటు లుండె :

వెనుకటి తరములో వెలువడిన పురాణాంధ్రీకరణములకు సహపాఠుల వంటి గ్రంథములు నేడును వచ్చుచున్నవి. భారత భాగవత రామాయణములు బ్రహ్మాండాది పురాణములు తెలుగు పద్యములలో వ్రాసి మనకిచ్చిన మొన్న మొన్నటి శ్రీపాదవారు, జనమంచివారు, వావిళ్లకొలనువారు, చివుకులవారు, దాసువారు, ముదిగొండవారు, పిశుపాటివారు, మల్లాదివారు-అవ్వారిగా వేసిన ఒరవడి చెఱిగి పోవుటకు వీలులేదు. పురాణ సంప్రదాయధారను మా ఛందోధోరణిలో మేము ముందుకు నడపి తుమని కొందఱు కృతప్రతిజ్ఞలు చేయుచున్న పద్యరచనలు ఈ నడుమ నడుమ వెలువడుచునే యున్నవి. శ్రీ బులుసు వేంకటేశ్వరులుగారి మహాభారతము, భాగవతము, ఆధ్యాత్మరామాయణము, వాల్మీకి రామాయణాంధ్రీకరణము - అవన్నియు నిర్వచనములు, సుబోధ సురుచిరములు. వాజపేయయాజుల రామసుబ్బారాయ కవిగారు "ప్రసన్న భారతము" వ్రాసిరి. తరువాత - మొలుగు చంద్రమౌళి శాస్త్రిగారు ఆంధ్రకూర్మ మహాపురాణ మొకటి; అనుముల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారి భార్గవరామచరితము ముద్రితము. అనంతపంతుల రామలింగస్వామిగారి "భార్గవరామాయణము" స్వతంత్రరచన. ఇవి-ఇంచుమించుగా, పాతిక-యిర్వది యేండ్లలోపున వచ్చినవి. ఈ గ్రంథములకు తగిన పాఠకులు నేటికాలమున చాటున మాటున ప్రకాశించుచునే యున్నారు. ఒకవంక పురాణాంధ్రీకృతులు; వేఱొకదెస నవీన స్వతంత్ర కృతులు పోటీపడి ముద్రితములగుచున్నవి.

"నవ్యతరమైన యొక్క గానస్రంతి
కొకఁడు తలయూఁచు; మఱియొకఁ డోసరించు
వీణదే దోషమో, లేక వినెడివారి
తప్పిదమొ ! కాదు భావభేదములె సుమ్ము"

అన్న పుట్టపర్తి నారాయణాచార్యుల వారి గాఢప్రతిభనుండి పండరి భాగవతము ద్విపద కావ్యముగా అవతరించినది పద్యకృతులలో ద్విపదలకుగల పలుకుబడి నేడును పొనుగువడలేదు. సోమనాథుడు–రంగనాథుడు–గౌరన ఇట్టి పూర్వకవులు పరిక్షుణ్ణము చేసిన దారిలో, జాతిచ్ఛందములో పుట్టపర్తివారు పండరిభాగవతము తలపెట్టి వ్రాయుట వారి సంప్రదాయ గౌరవమునకు తార్కాణము, ఆయన భక్తిబంధురుడు; విదితాష్టభాషా కవిత్వ విశారదుఁడు. "పండరి భాగవతము"ను గూర్చి వారి పదము లివి

"(రసము) యమకంబు గమకంబు నమరెనజాతిఁ
గ్రమహితాన్వయముఁ గారకముల సొంపు
నుడులలోఁ దూగు నానుడులలో బాగు
నడకని గతియు, జొప్పడినట్టి మితియు
ధ్వని, యలంకార, ముత్తమశైలి. పాక
మనవద్య, మౌచితి యర్థ విన్యాస
మప్పు డప్పుడు గుప్పు గుప్పున వెడలి
ముప్పిరి గొన. . . . .

విబుధకోటికి మోదము గూర్చు రచన బెళ్ళూరివారి "వివేకానందము" ద్విపద కావ్యము వెలువడినది. మరికొన్నింటి నామధేయములు స్ఫురణకు రాకున్నను ఉన్నవి. కాళిదాసుగారి "ఆంధ్ర మహావిష్ణువు" ప్రసిద్ధము.

నన్నయనాటి మధ్యాక్కరలకు ఈ మధ్య ప్రత్యేక గ్రంథ గౌరవము వచ్చినది. విశ్వనాథమధ్యాక్కరలకుఁ బిమ్మట నేడు సుప్రసన్న - సంపత్కుమారులు మున్నగువారు ఆ యోజ్జనమును ఉజ్జగింపక ఖండికలు వ్రాయుచున్నారు.

తెనుఁగులో అనుష్టుప్పులు - ఉత్సాహములు - వియోగినులు- మందాక్రాంతములు - మచ్చులు చూపించుచున్నవి. ఛందస్సు అవు ననుచునే వివిధములగు జాతులతో వృత్తములతో సాధనలు చేయు తీరు ముచ్చట గొల్పుచున్నది. లోకము భిన్న రుచికము, శతకములు, ద్విశతులు, త్రిశతులు, పంచశతులు ప్రచురితములై నేఁడు పెక్కు-పాఠకులను కూడఁగట్టుకొను చుండుట పరికించు చున్నాము. ఇట్లే ఉదాహరణ కావ్యములు అపుడపుడు పలుకరించు చున్నవి.

''ఉదాహరణము'' చిన్ని కావ్యశాఖ. సప్తవిభక్తులలో ఒక్కొక్క విభక్తికి ఒక వృత్తము. కళిక, ఉత్కళిక, సంబోధనవిభక్తి సార్వవిభక్తికము, మొత్తము ''పాతిక'' పద్యాల కబ్బము. ఏయితర భాషలచే అచుంబితమైన ప్రక్రియ. నిడుదవోలు వేంకటరావుగారు ఉదాహరణ వాఙ్మయముపై ప్రత్యేక గ్రంథము వెలువరించి పరిశోధనాపరమేశ్వరు లనిపించుకొన్నారు. దక్షిణాంధ్రయుగమున - ప్రబంధయుగమున - శ్రీనాథయుగమున వంద వందయేండ్లకు ఒందు రెండుగా లెక్కకు వచ్చిన ఉదాహరణ కృతులు, ఈ యిర్వదేండ్లలో ఏడెన్మిది జతలు లెక్కకు వచ్చుట ఈ ప్రక్రియలోని విశేషము. కళికోత్కళికలతో గేయప్రాయమైన సోయగము దీనికి నైసర్గికము.

ఇటులీ లఘుకావ్యశాఖలు యథారుచిగా చిగుళ్లు మొగ్గలు పెట్టు చుండగా, ఈ నడుమ ఖండకావ్యములు కలకండములవంటివి అనల్ప సంఖ్యాకములు సహృదయులను ఆవర్జించుచున్నవి. ఈకృతు లలో కొన్ని శతాబ్దిపూర్వార్ధము ననే పుట్టి పునఃపునర్ముద్రణములు పొందినవి యుండిన నుండవచ్చును.

మల్లెపూవులవంటి తన పద్యములు దండలుగ్రుచ్చి గాంధర్వ కంఠమున వేసి వాసిగాంచిన జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి కరుణశ్రీ

ఉదయశ్రీ, విజయశ్రీలు తెలుఁగునేల నాలుగు చెఱుగుల నడయాడు జంగమ కృతులు, ప్రాఁతవడని పద్యోపశ్రుతులు.

చారిత్రక సారస్వత పథములో కీర్తనీయములైన అద్యతన కావ్యములలో "కొండవీటి రెడ్డి రాజ్యమహోదయము" బెళ్ళారి శ్రీనివాసమూర్తిగారిది క్రొత్తగా ఉదయించినది. అష్టాదశ పర్వ నిర్వహణ సంభృతమైన నవభారతము. రెడ్డి వంశవృక్షమ్మున రెమ్మ రెమ్మ కొమకొమ్మ కదల్చి సంతరించిన కబ్బము. రాయలసీమ సంభవములైన కతిపయ చరిత్ర కృతుల కిది సహోదరము సమర్థము సరసము ప్రావాహికము నైన పద్య పద్య. ఈ సరణిలో ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారి కీర్తితోరణము ప్రత్యగ్రప్రతిష్ఠకు వచ్చిన రచన. "దక్షారామము"న మొగ్గదొడిగిన తీవలు "కీర్తితోరణము"లో సురభిళపుష్పమూర్తులు. ఓరుగల్లుకోట - కీర్తితోరణము - వెయ్యి స్తంభాల మండపము - హనుమకొండ కొండలు రాజధానీస్మృతులు కదిపి పలికించిన కాకతీయచరిత్ర రేఖాకృతి.

"ఈ పురాణ కవాటమ్ము లెపుడు బంధి
తమ్ములయ్యెనొ ? యిపు డేరు తట్టితట్టి
పిలుతురయ్య! ఊరక యివి విడవు పొందు
వెల్లురాక పిల్పులు లేక బిగిసిపోయె"

ఏకశిలలో ప్రాఁతవడ్డ తలఁపుతలుపులు తట్టి పిలిచి, వెలుఁగునకు వచ్చిన "కీర్తితోరణము" ఇంద్రగంటివారి పద్యరచనా చాతురీశిల్పములకు చారణగీతము.

సింహపురికి సంబంధించిన విస్మృతేతిహాసమునకు రసస్మృతి యనదగిన "పూర్ణాహుతి" ముదివర్తి కొండమాచార్యులవారి ఖండ కృతి ఏకదేశవస్తుకమైనను సుపరిష్కృతమైన పల్కుబడిగల కావ్యము

తెలుగుపద్య నిర్మాణములో ఆచార్యులవారి మర్మజ్ఞత లోభనీయ మైనది. సంప్రదాయ మనోజ్ఞములైన పద్యరచనలలో "పూర్ణాహుతి" గుర్తుపెట్టుకొనదగిన జాతివార్తాప్రబంధము

విద్వాన్ బీర్నీడి ప్రసన్నగారి "పృథ్వీభాగవతము" భావధారా సంయుక్తమైన రచన. ఇంతటి ప్రావాహికమైన జాతిపద్యమును ఎక్కడనో కాని చూడలేము. కవికోకిలము జాషువగారి "క్రీస్తు చరిత్రము" వచ్చి అట్టే కాలము కాలేదు. ఆయన కలకంఠమునుండి వచ్చిన తెలుఁగు పద్యము వసంతవనము.

ఆ నడుమ వెలువడిన "కృష్ణకథావిపంచి" బాడాల రామయ్య గారిది – "వీరభారతము" వక్కలంక లక్ష్మీపతిరావుగారిది - ఆంధ్ర మహాయుగము, శిష్టా లక్ష్మీకాంతశాస్త్రి కృతము – ఆనందభిక్షువు" వి. వి. యల్. నరసింహారావుగారిది - "ఆమ్రపాలి, జ్ఞానానందకవి ప్రణీతము – "కరుణాసౌగతము, తి మ్మ ర క్షి త" – కరుటూరి సత్యనారాయణగారి కావ్యయుగళము - "తిక్కన" వేముగంటి నరసింహాచార్య రచితము - "సుజాత" కాకర్ల వేంకటరామనరసింహ ప్రణీతము – ఏతాదృశములగు ఎన్నో ఖండకావ్యములు కవితాగోష్ఠు లలో ప్రసక్తములు ప్రస్తూయమానము లగుచున్నవి.

విశ్వనాథ వేంకటేశ్వర్లుగారి "కాళిందీపరిణయము" అంభో వాదములో కవితాస్వాదము ఉన్మిశ్రము చేసిన విలక్షణ పద్యరచన. లక్షణలక్షితము, వ్యుత్పత్తి రంజితమైన తెనుఁగు కావ్యము.

మోటూరి వేంకటరావుగారి రచనలు చకోరసందేశము, సింహ బలి, పద్మినీభాస్కరము దేనికదే ప్రత్యేకత సంతరించుకొన్నది. వానిలో "పద్మినీ భాస్కరము" లోని ఛందఃప్రణాళిక సరిక్రొత్తది అనగా, భావగతికి ఛందస్సునకు గల పరస్పర సంబంధము ఈ కావ్యములో

రమణీయముగా దర్శనీయము. ఈ కావ్యమున ఎనుబదిరెండు వృత్తములు సంస్కృతచ్ఛందస్సులు వాడబడినవి. ఆ వృత్తముల పేరులు శీర్షికానామములు. కవిత్వచ్ఛందస్సుల ఉభయ విధ వైచిత్రికి ఈ కృతి సంకేతము

యస్వీ జోగారావుగారి "ప్రసన్న కుసుమాయుధము" ఒక క్రొత్తకూర్పు. విలక్షణమైన విచిత్రమైన శృంగార రసపర్యాలోచనము చేసిన యిట్టి కావ్యములు మన సారస్వతములో ఒండు రెండు ఉండవచ్చును. ఉన్నను, దాని కదిసాటి. పూర్వ ప్రబంధ పాకములో ప్రత్యగ్ర పరిమళమును వెలయింపజేసిన యిందలి పద్యము రసశ్రీ హృద్యము.

విమర్శకులుగా భావుకులుగా పేర్వడసినవారి పద్యరచనలును ఇపుడు-అపుడపుడు పొడసూపుట శుభోదర్కముగా నున్నది. ఆర్. యస్. సుదర్శనముగారి "నిశాంతం" కవిత ధ్యానవస్తుకమైన నూతన కృతి, అనుభూతి కావ్యము. ప్రకృతి-ప్రపంచ-రహస్యములకు సూక్ష్మతరమైన వ్యాఖ్యాగీతము. సాంకేతికమైన ధ్వనులకు ఛందస్సుందరమైన గీతమును ఊంతగా చేసికొన్నారు.

చాగంటి గోపాలకృష్ణమూర్తిగారి "హేమమాలి" ఒక భావుకుని ఉషస్స్వప్నమువంటి పద్యకృతి. శనగన నరసింహస్వామిగారి వాల్మీకి, చైత్రవంది-సుందర పద్యరచనలు. వేదులవారి కృష్ణశాస్త్రిగారి భావకవిత్వపు జాడల కీనాఁడును అవకాశమున్నదనుటకు నరసింహస్వామి కృతమైన "చైత్రవంది" ఒక యుదాహరణము.

"మహాంధ్రోదయము"తో ముందునకు వచ్చిన దాశరథిగారి 'కవితా పుష్పకము' సహృదయులకు మనోహరదృశ్యము. సంప్రదాయస్ఫూర్తి రుచిరమైన ఆయన తెనుగు పద్యము పునర్నవము. నాయని సుబ్బారావుగారి వేదనా వాసుదేవము, జన్మభూమి వెంబడి వచ్చిన

ప్రతికృతియు సంప్రదాయ సాహితికి చేర్చుకొ. దేవులపల్లి రామానుజ రావుగారి పద్యమాలికలతో ఆంధ్ర సారస్వత భవనమున పచ్చతోరణము అలంకృతమైనది.

బోయి భీమన్నగారి ఖండ కృతులు సభలో హాయి హాయి అనిపించుకొనుచున్నవి. ఉత్పల వారి "జంటనగరాలు హేమంత శిశిరాలు" చమత్కార చారువైన కావ్యము. ప్రౌఢము, మధురము నైన పద్యరచనా రీతి దీనిలో విందుసేయును.

ముదిగొండ వీరభద్రమూర్తి గారి 'వందేమాతరం' దిగుమర్తి వారి "స్వామి పుష్కరిణి" కోటగిరి విశ్వనాధరావుగారి "ఖడ్గనారాయణము." కొర్లవాటివారి "సువర్ణరేఖలు" చేబోలు చిన్మయబ్రహ్మముగారి విశ్వదాభిరామము మొదలగు కృతులు—తమ తమ శైలీ విలాసమును భావలీలను ఆయాసందర్భములలో ప్రదర్శించుచున్నవి.

ఈ రెండు దశాబ్దులలో అవధాన ప్రక్రియకు సంబంధించిన పద్య రచనయు కొలఁది కొలఁదిగా సాగివచ్చినది సి. వి. సుబ్బన్నగారి 'శతావధాన ప్రబంధము' మనము తీసికొనదగిన గ్రంధ సాక్ష్యము. ప్రసాదరాయ కులపతి, కుక్కుటేశ్వరరావు, కోట వీరాంజనేయ శర్మ, బులుసు రామమూర్తి, దివాకర్ల వేంకటావధాని గారలు అవధానములు చేయుచున్నారు. మఱికొందఱును ఈ శాఖను పెంచుచున్నారు. "అవధానములు" అను పేర గాడేపల్లివారి పుస్తక మొకటి వెలువడినది. మంచి పద్యములు సంతరించుచున్న మహిళామణులు కొందరు నేఁడు పేర్కొనదగి యున్నారు. శ్రీమతి బుఱ్ఱా కమలాదేవి, కల్లూరి విశాలాక్షమ్మ, నండూరి చంద్రమతిదేవి. ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ వేదుల మీనాక్షీదేవి ప్రభృతులు.

పద్యరచనలు సంప్రదాయ మార్గములో ఇన్ని యీ నడుమ వచ్చినవి; వచ్చుచున్నవి. పఠితలు వీనిని చదువుచున్న సాక్ష్యములును లభించుచున్నవి. తరతమ భావములు తప్పవు. కవితకు ప్రధానము లైన రసభావములను మనస్సులో పెట్టుకొని, ఎక్కడ పద్యరచన సాగినదో అక్కడ సహృదయుడు ఆనందింపగలుగుచున్నాడు. అట్టి కావ్యము రమణస్థాన మగుచున్నది. పదికాలములపాటు తాదృక్పద్య మునకు భావుకహృదయస్థితి యేర్పడుట జరుగుచున్నది. సమగ్రాంధ్ర సాహిత్యము పద్యరచనలమీాద ఎంత ఆర్ద్రభావము కలిగియున్నదో మన మెఱుఁగుదుము పద్యము ఛందోబద్ధమే. అయిననేమి, అది భావమును స్వచ్ఛందసుందరముగా ఆవిష్కరించుచున్నది. నిర్బంధము కాదు. పద్యరచనా వైభవమునకు లక్ష్యములు నేఁడు కానబడు చున్నట్లే, లక్షణప్రచారముకూడ చక్కగా సాగుచున్నది.

శ్రీ దివాకర్ల వేంకటావధానిగారి వంటివారు నాటి పద్యరచన లనుగూర్చి ప్రమాణపురస్సరముగ చేయుచున్న ప్రసంగములు కావ్య ముల యెడ రుచిదార్ఢ్యమును కలిగించుచున్నవి. "యువభారతి" - ప్రభృతి సంస్థలు, "ఆంధ్ర సాహిత్య అకాడమీా" పద్యరచనలకు చేసిన పురస్కారము, ప్రచారము మఱవఁజాలనిది.

ఒకమాట: పద్యము రసవత్తరముగా, వ్రాయగలిగినవారు కొంతకాలము వ్రాసి వ్రాసి, ఆశ్రమాంతర ప్రవేశము చేసినవారు మన తెలుగు కవులలో ఉన్నారు. ఉండవచ్చును. చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు చివరినాళ్ళలో వ్యావహారికమును బండ్లదోలినారు. అది వారి గ్రాంథికమునకు తిరస్కృతికాదు. తత్కాల ప్రయోజనము - స్థిరలాభము - అన్నవి రెండును కవియొక్క కలము చివరి మొనలు. వ్రాత ఒకటియే కావచ్చును. "పుణ్యైర్యశోలభ్యతే" ఒకప్పుడు కాలములో, కవియొక్క కాంక్ష తారుమారు కావచ్చును.

లబ్ధ ప్రతిష్ఠులు పెద్దలు సాధారణ రచనలు చేయుట - ఆకు మఱుగున యువకులు ఉజ్జ్వల రచనలు చేయుట - నేడు తత్ర తత్ర చూచుచున్నాము. మన సారస్వతమున ఈ శతాబ్దిలో మొలకదేఱిన ప్రక్రియలు కొన్ని యున్నవి. "పద్యరచన, యన్నది అట్టి ప్రక్రియ కానే కాదు. ఇది మొదలు. మొదలు లేనిచో చిగుళ్ళు, పువ్వులు, పండ్లు ఎక్కడివి! "అహో! మూలచ్ఛేదీ తవ పాండిత్య ప్రకర్షః" అన్నటులు తయారగును.

కలసి బ్రతుకుటయన్న సిద్ధాంత మొకటి సర్వాంగీకృత మని రాచఱికపు మాటలలో విభిన్న ప్రక్రియలలో వ్రాసికొనుచున్నారు. యథాప్రతిభముగా వారి రచనలు పాఠకుల నాకర్షించునవి. సహృదయా వర్జనము చేయగలుగుచున్న ఆయాకవుల రచనల వెనుక వెనుక, ఒకానొక రమణీయ చ్ఛందోధర్మగీతమును సంప్రదాయవాది త్రవ్వి యెత్తుచున్నాడు.

గుంటూరి శేషేంద్రశర్మగారు,కుందుర్తి, ఆరుద్ర, బాలగంగాధర తిలక్, సి. నారాయణరెడ్డిగారలు పద్యములు సొగసుగా రసవంతముగా పాడి చూపించినవారు. శ్రీరంగం శ్రీనివాసరావుగారు సరేసరి. పూర్వా శ్రమముల యందలి వీరి పద్యములు వీరి సంప్రదాయ గౌరవము క్రొత్త తరమువారికి కొంత తెలియజేయవలసియున్నది. అదియు సాగుచున్నట్లే యున్నది.

నేటి పద్యరచనలను గూర్చి యిందాక నేను 'వంది'నై ప్రసంగించినట్లే నా కనిపించుచున్నది. ఇక - ముగించుచు రెండు మాటలు. భవితవ్య మన్న విశేష్యమునకు మేలు, భాగ్యము అనునర్థమే మన భాషలో ఉన్నది. భవితవ్యత - అనగా రాబోవునది - యెప్పుడును మేలు; రసవత్ కవితాధర్మము నాల్గుపాదముల నడచినంతవరకు నేటి పద్యరచన భవితవ్యము సురక్షితము.

—♦♦♦—

# నా సాహిత్య దృక్పథం

ఎంతటి ప్రతిభావంతునకైనా "ఇదీ నా సాహిత్యదృక్పథం" అంటూ నిర్దేశించడం సంక్లిష్టమైన సన్నివేశం. స్వశక్త్యనుసారం కావ్యాది రచనలు చేయనూ వచ్చు, వాడికొక దృక్పథం ఉండనూ వచ్చు. అయితే - "ఇది నాది" అని గుండెమీద చెయ్యివేసుకుని చెప్పి రావడం సాధ్వసమూ సాహసమూ అనిపించక మానదు. లోకములో సహృదయ సామాన్యముగా అనుభోగ్యమవుతున్న ఒక వస్తువునందు వైయక్తికమైన ఆత్మీయభావన ఉండక తప్పదు. కవిత్వమూ, సహృదయత్వమూ వేరువేరు కావు. సరస్వతీతత్త్వము కవి సహృదయాఖ్యమన్నది ప్రసిద్ధమైన వచనము.

"స్థానవిశేషాత్ప్రకాశాదివత్" - జ్యోతి ఒక్కటే అయినా, అది ఉన్న స్థానాలనుబట్టి భిన్నత్వం కల్పితమవుతున్నది. ఉపాధివిశేషం వల్ల ఒకే ఆత్మకు వైవిధ్యం గోచరిస్తున్నది. సాహిత్య విషయంలో కూడా ఇంతే. రసాత్మకమైన జాతిని సచేతనం చేసే మహాసరస్వతి - పూర్వకవులు దర్శించిన వాణి - అర్వాచీనుడైన వానికి ఒక చూపును ప్రసాదిస్తోంది. ఏ శక్తివల్ల తనకు ఈ లోచనం అనుగ్రహింపబడిందో, ఆ లోచన పథంలోనే సాగి సరస్వతీదర్శన లాభం పొందగలుగుతున్నాడు.

ఇటువంటి పీఠిక మీద భావించుకుంటే - ప్రత్యేకించి "నాదీ" అన్నది ఏది! - సుకుమారమైన ప్రస్తావం.

నిత్యప్రవాహ శీలమైన సంప్రదాయ సాహిత్య తరంగిణిలో ఇదీ ఒక కెరటం. పూర్వులైన మహానుభావులచేత పరిక్షుణ్ణమైన రాచబాటలో నేనూ ఒక పథికుణ్ణి. ఆ ప్రస్థానంలో నాదీ ఒక సహయానం. మరి - నీ క్రొత్తదనం ఎక్కడ! అంటే -

"యానేవ శబ్దాన్ వయ మాలపామో
యానేవ చార్థాన్ వయముల్లిఖామః
త్తైరేవ విన్యాస విశేషభవ్యై
స్సంమోహయంతః కవయో జగంతి"

ప్రాత మాటలే, ప్రాత అర్థాలే, కవియొక్క నూతనత్వం విన్యాసవిశేషంలో ఉంది. కూర్పు నేర్పు క్రొత్త మెఱుపులను మెఱయిస్తుంది. హృదయం ఉన్నవాడికి నయనోన్మేషం కలిగిస్తుంది. మేఘాలను కాదంటే మెఱుపులూ ఉండవు. శబ్దార్థాలను కల్పనలను కాదంటే మిగిలేది వట్టి కాగితాలకట్ట. అనంతకాలంలో, పోనీ - తెలుగు సాహిత్యం వ్యాపించిన కాలపరిధిలో ఋషికల్పులు; సిద్ధులు, సాధకులు ఎందఱో! ఆంధ్రసరస్వతి ప్లాదమయి; అనన్య పరతంత్ర. నా అన్వేషణ యిలా ఉంటుంది :

వెదకుచుందును శబ్దవిన్యాస కౌశలీ
మధురిమాతత చతుష్పథములందు
తడవుకొందును తదర్థ విభూతి విస్మర
వ్యాకృతి స్ఫోట గహ్వరము లందు
ఓర్మి గవేషింతు నుజ్జ్వల వస్తు క
ల్పనవిధానల్ప శిల్పములయందు
కోర్కి నన్వేషించుకొందు నలంకార
కనకవల్లీ కుడుంగముల యందు
తత్ర తత్ర ప్రతిధ్వనత్త్వావకీన
విద్యుదాకార రేఖ హృద్వీథి నిలిపి
నీరసంబైన బ్రతుకును స్వారసికము
చేసికొనుటకు నీ కృపాసిద్ధివలతు

ఇప్పటికి అర్థశతాబ్ది అయింది. 1930 లో - నాకు పదేళ్ళ వయస్సు. ఆ పసినాటినుంచీ అన్వేషణ మనేది నాకు తెలియకుండా పట్టుకున్న వ్యసనం. మా యింట్లో ఉన్న బీరువాల అరల్లో తలదూర్చి కూర్చోడం; ప్రాత పుస్తకాలు వెదకడం; దేనికోసమనే ప్రశ్న లేదు. పుస్తకం పేరు, కర్త పేరు, పద్యమా? వచనమా? ఏ బాపతు గ్రంథం! ... గ్రహించి ముందుకి వెళ్ళడం. ఇటువంటి గవేషణలో నా కంట్లో మెఱసినదైనది.

పుస్తకం పట్టుకున్నాను. దానికి అట్ట లేదు. కర్త పేరు తెలియ లేదు. గ్రంథం పేరు సులక్షణసారం. పేరునుబట్టి పద్యలక్షణాలు ఉండే గ్రంథం అని గ్రహించాను. ఎగిరి గంతు వేశాను. ఛందస్సరస్వతి అనుగ్రహించిందనుకున్నాను. స్వచ్ఛందంగా గంతులు వేసే ఆ బాల్యంలో ఎందుకు ఛందస్సుకోసం ఈ తహతహ! నా అన్వేషణకు లక్ష్యం అదా! ఇప్పుడు పూర్వాపరామర్శ చేసి చెపితే - ఛందస్సు అప్పుడూ, ఇప్పుడూ నాకు ప్రతిబంధకం అనిపించలేదు. సరికదా, భావానికి ఆచ్ఛాదనం ఇచ్చి ప్రాణశక్తిని ప్రసాదిస్తూ ఉన్నది. ఒక ఆహ్లాదం కలిగించి జీవరక్తిని కలిగిస్తున్నది. అవును!

ఛందశ్శబ్దంయొక్క పుట్టుక గ్రహిస్తే ఈ ధర్మాలు దానియందు ఉన్నవన్న రహస్యం తెలుస్తుంది. తెలిసి లాభంలేదు. అనుభవంలోకి తెచ్చుకోవాలి. అదొక గాంధర్వ విద్య. ఛందోమర్యాదలో ఉన్న కవిత్వమే స్థిరప్రయోజనం సాధించగలది.

ఛందస్సుందరమైన పద్యకవితా సారస్వతంబన్న నా
డెందమ్మూరి సముద్రమై పొరలి గొండ్లింజేయు నానందని

ష్యందంబై ...'' అంటూ, నా ఆంధ్రపురాణం చాళుక్యపర్వంలో రాజరాజుచే అనిపించాను.

నా చిన్నప్పుడు మా నాన్నగారు మంచిమంచి తెలుగుపద్యాలు భారత భాగవతాది కావ్యాల్లోంచి ఏరి కంఠస్థం చేయించేవారు. "ఎందుకబ్బా!" అనుకునేవాణ్ణి. అప్పటి కవి కంఠస్థాలే కాని, కాల క్రమంలో లోపలికి వొచ్చి, హృదయస్థానాన్ని విప్పార్చి, పుప్పొళ్ళు జల్లుకుంటూ ఇప్పటికీ విహరిస్తున్నాయి.

కుమారాస్త్ర విద్యాప్రదర్శన ఘట్టంలో రంగత్ ప్రారంభుడైన అర్జునుణ్ణి గూర్చి - నన్నయగారి పద్యం

"హరి విచిత్ర హేమ కవచావృతుఁడున్నత చాపచారు దీ
ర్ఘోరు భుజుండు భాస్వదసితోత్పల వర్ణుఁడు సేంద్రచాప శం
పారుచి మేఘమో యనఁగఁ బాండవమధ్యముఁడొప్పె బద్ధతూ
ణీరుఁడు రంగమధ్యమున నిల్చి జనంబులు తన్నెచూడఁగన్."

అందరి చూపులూ పార్థునిమీదే ఉన్నాయి. ఉండనివ్వండి. గారి ప్రసన్నజ్యోతీరూప రీతి మీదనే నాచూపు నిలబడి ఉంది. విత్వ వసంతారామంలో ఆయన తొలిగంటం - కలకంఠం. పర్వమంతా ఆయన యశోగానం.

"కాలంబెంత గతించిపోయినను నాకల్పాంత సంస్థాయిగా
నేల న్నిల్వఁగఁజాలు వ్యాస కవితా నిర్మాణమున్ బాసలో
నాలాపింపఁగఁ బంచమ శ్రుతి గరీయస్మాధు సన్మాధురీ
శ్రీలన్ నన్నయ కోకిలంబు సవరించెన్ గంటపుంగంఠమున్."

ఇక్కడే ఒక్కమాట చెప్పవలసి ఉంది — నన్నయ తిక్కన లిద్దరూ తెలుగుసాహితికి కన్నుగవ. తక్కిన మహాకవుల అందరి సృష్టీ కలిపి ఆమె భ్రూమధ్యరేఖ. నన్నయగారు పద్యవిద్యకు ఆద్యుడు. అయితే, క్రియాపదబహుళమైన తిక్కనగారి పద్యశైలి తెలుగులో క్రొత్తదైన గద్యరచనకు మేలుబంతి అయినదని నే ననుకున్నాను

అలతి అలతి పదాలతో, పొట్టి వాక్యాలతో ఒయ్యారంగా నడిచే ఆధునికయుగ వచన రచనలోని కాకుస్వర రామణీయకానికి తిక్కన గారు పెట్టినదే భిక్ష.

1940 ప్రాంతం నేను "ఆంధ్రి" సాహిత్య మాసపత్రిక నడిపే రోజులు. తెలుగులో పద్యంకంటే - వచనం ప్రచురంగా రావాలని అనుకున్నాను. అవి సూర్యరాయాంధ్ర నిఘంటువులో ఉద్యోగించిన రోజులు కూడాను. గ్రాంథికంమీద అభినివేశం ఉండేది. రామయ్య పంతులుగారు, రామమూర్తిపంతులుగారు-వాళ్ళభాషావాద భేషజాలు చూస్తూ ఉండేవాణ్ణి. పద్యరచన ఎలాగూ గ్రాంథికమే అయి ఉండాలి. ఇక సాధారణ ప్రయోజనానికి వ్యావహారికం వ్రాయడం తప్పేముంది!... నా దృష్టి కొంచెం మళ్ళుతోందని వివేకించుకున్నాను. "యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరోజనః" అన్నట్టు - కవి జ్యేష్ఠులైన చెళ్ళపిళ్ళవారి వ్యాసాలు, కథలూ - గాథలూ, వేలూరి శివరామశాస్త్రిగారి కొన్ని రచనలూ - వాడుకభాషలోనే ఉండడం - తెలుగు పాఠకుల్ని అవి విరివిగా ఆవర్జించడం - గమనించుకున్నాను. ఇంతవరకూ "ఫరవా లేదని" "ఆంధ్రి" పత్రిక నిబంధనలు కొన్ని సడలించాను.

చెప్పవచ్చేదేమంటే! వెనుకటి పుట్టుకల సంస్కారం, ఇప్పుడు చదివిన భారతీయమైన చదువు - జీవనాడీగతమై తెలుగుతనం ప్రాణ ప్రియమైన ఆంధ్రభాష... వీటితో పరిపాకమవుతున్న నా అంతరంగం మీద నవ్యసాహిత్యచ్ఛాయ పడలేదనడం అసత్యమే అవుతుంది.

1950 లో వెలువరించిన "ఆంధ్రరచయితలు" అనే గ్రంథం నేను దాచినా దాగేదికాదు. కడచిన శతాబ్దిలో పుట్టిన నూరుగురు కవుల - ఆధునిక సాహిత్య రీతులు నేను అధ్యయనంచేసిన పద్ధతి సహృదయులు తెలుసుకునే ఉన్నారు. యథార్థం చెపితే సాహిత్యంలో ప్రాచీనమనీ, నవీనమనీ భిన్నత లేదు. దాని ప్రయోజనం అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడూ విశ్వశ్రేయస్సే; లోకకళ్యాణమే జగద్ధితమే.

ఒక్కటి :- సహిత భావమే సాహిత్యం. ఈ శబ్దంలో ఉన్న "హిత" మనేది స్పష్టంగా వినిపించాలి. ఆ "హితం" తిరోహితమైతే సాహిత్యం అనిపించుకోదు; అది దార్గత్యం!"

మన తెలుగులో పూర్వమహాకవులందరూ సంప్రదాయము యొక్క అవిచ్ఛిన్నధారనే అర్థిస్తూ, ప్రతిభాప్రభుత్వంతో కావ్య నిర్మాణం చేశారు. "ముఖేముఖే సరస్వతీ" మూలసూత్రం ఒక్కటే అయినా, ఎవరి ముద్ర వారిది; ఎవరి శైలి వారిది, ఎవరి శిల్పం వారిది...

ఈ శతాబ్ది రెండవ చరణంలో జాతీయతావస్తుకమైన అనేక రచనలు వెలువడ్డాయి. చరిత్రలో, అందునా, ఆంధ్రుల చరిత్ర మనోజ్ఞ ఘట్టం తీసుకొని పద్యకావ్యం వ్రాయాలన్న తలంపు ఉండేది. "విశ్వనాథ నాయకుడు" చిన్నకావ్యం వ్రాశాను. "మాధవవర్మ" వృత్తాంతం తీసుకొని మరొకటి వ్రాశాను. "పలనాటి వీరచరిత్ర" పద్యంగా వ్రాద్దామని నాలుగైదు వందలు వ్రాశాను. ఆత్మకు తృప్తి కలగలేదు. చిలుకూరి వీరభద్రరావుగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, నేలటూరివారు, మారేమండవారు...వారి చరిత్ర పరిశీలనా గ్రంథాలు మెలకువతో చూచాను - చూస్తున్నాను.

ఆ తరుణంలో గడియారము వేంకటశేషశాస్త్రిగారి "శివభారతం" వచ్చింది - అంతకుముందే రాజశేఖరశతావధానిగారి "రాణాప్రతాప సింహ చరిత్ర" పేరు తెచ్చుకుంది. ఈ రెండూ రసధారా మనోహరములైన కావ్యాలు. నాకొకటి అనిపించింది. మన తెలుగువారు చరిత్రలో జ్వలులు కదా! ఆంధ్రుల సమగ్ర చరిత్రనే ఇతివృత్తంగా తీసుకుని కావ్యం ఎందుకు వ్రాయకూడదు! ఒక సందేహమూ కలిగింది - సాతవాహనులు, చాళుక్యులు, కాకతీయులు, రెడ్డిరాజులు, విజయనగర సామ్రాజ్యం - తంజావూరు నాయకరాజులు ... ఇలా చూసుకుంటే - పూర్వాపూర్వ చరిత్ర మనకు స్పష్టంగా ఉపలబ్ధం కానేలేదు, తెలిసిన

దానిలోకూడా, అస్తి నాస్తి విచికిత్స! మరి - దీనికి "కావ్యత్వం" ఇవ్వడం ఎలాగ! రసజ్ఞామోదం కలగాలి కదా...! ఇంతలో - కుడి కన్ను అదిరింది; ఈ గీతం నా మనస్సులో మెదిలింది;

"అరమఱుఁగు మేలి ముసుఁగులో నందగించు
నాంధ్ర చారిత్ర సుర సుందరాంగి భంగి
మనసు పండువుగా నెంచుకొనెడి సిరికి
నోచువాడు, రసజ్ఞత మోచువాడు!"

ఆంధ్రపురాణం ఏకనాయకమైన కావ్యంకాక, ఏకవస్తుకమైనది. కాళిదాసు రఘువంశం మనస్సులో పెట్టుకుని పురాంధ్ర వీరుల చరిత్రాధ్యాయాలు నవ పర్వ సంభృతంగా సంతరించడం జరిగింది. కవియొక్క స్వీయాభిరుచులు కావ్యంమీద పడడం సార్వత్రికంగాదు, కాని, సాతవాహన ప్రభువు తిరస్కరించగా, గుణాఢ్యుడు బృహత్కథా కావ్యహోమం చేసిన ఘట్టంలో, పిఠాపురం మహారాజావారు రత్నపాంచాలికను నాచేత అనువదింపజేయడం, అచ్చువేయించడం... చివరకు ఆ ప్రతులు అణ్రదొక్కించివేయడం, ఆ కథ తెలిసినవాళ్ళు - కవియొక్క అంతర్వేదన ఇక్కడ ప్రతిఫలిస్తూ ఉంది అంటారు. అలాగే, చాళుక్యపర్వంలో నన్నయగారి భారతావతరణ ఘట్టంలోను; నేను దీనిని కాదనలేదు.

వ్యక్తియొక్క స్వాభిరుచి కావ్యంలో ఉన్నా, అది సమష్టితః సహృదయ లోకానుభవ సాధారణం కాగలిగితే - రమణీయమవుతుంది. కావ్యంలో ప్రవేశించిన తన అభిరుచి సాత్త్వికమైతేనే సహృదయాంగీకార్యం అవుతోందని భావించాలి.

ఇంక ముగింపు చేయబోతున్నాను...

తోరణం, శ్రీఖండం, చైత్రరథం, సదాశివ పంచాశిక...వంటి ఖండ కవితా సంపుటులు కొన్ని ప్రచురించాను. లఘుకావ్యం ఒ

ఘట్టాన్ని మాత్రమే చిత్రించి అందిస్తుంది. మహాకావ్యం - మహాపురుషుల జీవితాలను సరసంగా లక్షణ సమగ్రంగా వివరించగలుగుతుంది. తాదృశమైన కావ్యప్రయోజనం స్థిరమైనది సార్వకాలికమై మానవసమాజంయొక్క ఆభ్యంతర జీవితాలను ఏక సూత్రబద్ధం చేయగల శక్తి ఒక సంప్రదాయ సాహిత్యానికే ఉంది.

ఆ మధుప్రస్థానంలో నిన్న - నేడు, ప్రాత - క్రొత్త... అనే పరిచ్ఛేదం ఉండదు; అది - చిరంతనమైన చైత్రోద్యానం.

''ఎట్టా! నిన్నను నేఁట నాటినవియే? యేనాఁటి వేనాఁటి వీ
చెట్టుల్ ప్రోడులువాఱినట్లు లనిపించెన్; చూడఁగా జూడఁగా
నట్టే సర్వరసాలలోకమును సద్యః పుష్పిత శ్రీలఁ గ
న్పట్టెన్ ప్రాతలు క్రొత్తలై మధురథ ప్రస్థాన హేలాకృతిన్.''

